"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే"

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ సంపుటము



పునర్ముద్రణము

## 'అన్' నుండి 'అశ్విని' వఱకు

ముఖ్యసంపాదకుఁడు:

కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు, ఎమ్. ఏ.

## ద్వితీయసంపుటమునకు విలేఖకులు

| | |
|---|---|
| శ్రీ ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎమ్. బి. అండ్ సి. ఎమ్., భిషగ్రత్న. ... | ...అపస్మారము |
| శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు ... | ...అశ్వమేధము |
| శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు ... | ...అనాహతము<br>అనుభవసారము<br>అపరోక్షానుభూతి<br>అల్లమప్రభువు |
| శ్రీ కొంపెల్ల జనార్దనరావుగారు ... | ...అప్పారావు, గురజాడ<br>అప్పారావు, బసవరాజు |
| శ్రీ రాజా కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణరావుగారు, బి. ఏ. ... | ...అమరకము |
| శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు, ఎమ్. ఏ. ... | ...అనంతామాత్యుఁడు<br>అనపోతారెడ్డి<br>అనవేమారెడ్డి<br>అనాగరకసంఘము<br>అనుమానము<br>అనేకవర్ణసమీకరణము<br>అన్నయ్య, తెనాలి<br>అప్పకవి<br>అబ్బయామాత్యుఁడు<br>అభావము<br>అభిజ్ఞానశాకుంతలము<br>అభినయము<br>అర్థశాస్త్రములు<br>అలంకారములు<br>అల్లోపనిషత్తు<br>అవతారములు<br>అవధానము<br>అశోకవర్ధనుఁడు |
| శ్రీ గం. దూర్వాసశాస్త్రిగారు ... | ...అన్నభేది<br>అపస్మారము<br>అభ్రకము<br>అమ్లపిత్తము<br>అయస్కాంతము |
| శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు, బి. ఏ. ... | ...అనూరాధ<br>అపభరణి<br>అర్జునీనక్షత్రములు |

శ్రీ గోటేటి జోగిరాజుగారు, ... ...అనాస
అసిస్టెంట్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్.
అనుము
అరటి
అరటికుటుంబము

శ్రీ చివుకుల వేంకటరమణశాస్త్రిగారు ... ...అయనము

శ్రీ టి. ఆర్. చింతామణిగారు, ... ...అప్పయదీక్షితులు
ఎమ్. ఏ., పిహెచ్. డి.,
సంస్కృతభాషా ప్రధానోపన్యాసకులు,
మద్రాసు విశ్వవిద్యాలయము.

శ్రీ టి. యన్. రామచంద్రన్‌గారు, ... ...అమరావతీస్తూపము
ఎమ్. ఏ.
అయ్యనార్
ఆర్కియలాజికల్ అసిస్టెంట్,
గవర్నమెంటు మ్యూజియము, మద్రాసు.

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు ... ...అభిధేయము
అభిషేక నాటకము

శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారు, ... ...అమ్మరాజ విజయాదిత్యుడు
బి. ఏ., బి. ఎల్.
అమ్మరాజవిష్ణువర్ధనుడు

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, ఎమ్. ఏ. ... ...అభినయము

శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్యగారు, ... ...అరాజకత
ఎమ్. ఏ.
అర్థశాస్త్రము
రీడర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ హిస్టరీ,
పొలిటిక్స్ అండ్ ఎకనమిక్స్.

మహోపాధ్యాయ, ఆంధ్రకళాప్రపూర్ణ,
శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు ... ...అనిరుద్ధచరిత్రము

శ్రీ కల్యాణానందభారతీస్వామివారు ... ...అనుభూతిప్రకాశిక

# విన్నపము

విజ్ఞాన మానందము. విజ్ఞానము పురుషార్థము. విజ్ఞానము పరమార్థము. విజ్ఞానము పరబ్రహ్మము. విజ్ఞాన తరంగములు విశ్వవిలాసములు. శాస్త్రజ్ఞులు, కవులు, గాయకులు, శిల్పులు, మంత్రులు, యోధులు, మతాధిపతులు, త్యాగులు, కార్మికులు మొదలగు విజ్ఞానోపాసకులు దేశకాలపాత్రావరణాతీతమైన విజ్ఞానారాధనమును మానవధర్మాభ్యుదయమునకుఁ జేయుచున్న విధమును విజ్ఞానోదంత మనంతముఖములను విశదము చేయుచున్నది.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వమును నీ మహాకార్యమును యథాశక్తిని నిర్వహించుట కుపక్రమించిన విధము మొదటిసంపుటమునందలి ప్రస్తావనయందు విశదీకరింపఁబడినది. రెండవసంపుటమునం దీచర్విత చర్వణ మనవసరము. రెండవ సంపుటమును ప్రకటించుటయందుఁ గలిగిన కాలవిలంబనము వర్తమాన దేశ పరిస్థితులం దనివార్యము. బహుజన సాహాయ్యమునను, విశేష సాధనసంపద వలనను సాధ్యమైన ప్రచురణమునందు కాలవిలంబనము సహజము. రెండవ సంపుటమునకు వ్యాసములనువ్రాసి ప్రచురణమును సాధ్యముచేసిన వ్యాస లేఖకులకు వందనములు. మాకుఁగావలసిన ఛాయాచిత్రములనొసంగి ద్వితీయ సంపుటమునందు ముద్రించుట కనుమతించిన మద్రాసు గవర్నమెంటు మ్యూజియము, సూపరింటెండెంటుగారికిని, కోటగిరి ఆర్కియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, సదర్న్ సర్కిల్ సూపరింటెండెంటుగారికిని, కలకత్తా ఇండియన్ మ్యూజియము సూపరింటెండెంటు (ఆర్కియొలాజికల్ సెక్షను) గారికిని, హైదరాబాదు హెచ్. ఇ. హెచ్. ది నైజామ్స్ గవర్నమెంటు ఆర్కియొలాజికల్ డిపార్టుమెంటు డైరెక్టరుగారికిని సంపాదకులు కృతజ్ఞులు. పునర్ముద్రణము నందు నూతనాంశములు చేర్చఁబడి ద్వితీయసంపుటము అన్-అశ్విని వఱకును పర్యాప్తమగుచున్నది. భగవంతుఁడును, ఆంధ్ర మహాజనులును నీప్రయత్నము సార్థకమగుట కనుగ్రహింతురుగాత!

భావ సం. మాఘశుద్ధ ౧౪, శనివారము

కా. నాగేశ్వరరావు.

We have great pleasure in expressing our grateful thanks to the following, who so kindly acceeded to our request and granted us permission to reproduce some of their photos in this volume:

i. The superintendent, Government Museum, Madras;

ii. The director of the Archaeological department of H. E. H. the Nizam's dominions, Hyderabad;

iii. The Superintendent, Archaeological survey of indial Southern Circle, Kotagiri;

iv. The Superintendent, Indian Museum (Archaeologica, section), Calcutta.

**అన్** — అన్ అనునది దక్షిణబర్మాయందలి క్యాక్ ఫ్యూ జిల్లాయందలి యొకపట్టణప్రాంతమునకు పేరు. దీనివైశాల్యము ౨,౮౬౧ చతురపుమైళ్లు. జనసంఖ్య ౨౭,౮౬౩. అడవిభాగము విశేషము, వ్యవసాయము తక్కువ. రాబడి రూ. ౩౧,౦౦౦ లు. ముఖ్యపట్టణము అన్ అనునది. అక్కడ ౮౨౬ గురు జనులు గలరు.

**అనంగ** — భారతవర్షీయనది (భార, భీష్మ, అ. ౯).

**అనంగజీవన** — ఇది యొకభాణము. వాసంతికా వసంతశేఖరుల యన్యోన్యానురాగమును, వారిసమావేశము నిందు వర్ణింపఁబడినవి. ఆత్రేయసగోత్రుఁడగు వరదగురువు అనునతఁడు దీనిని రచించెను. విశ్వగుణాదర్శమును వ్రాసిన వేంకటాచార్యుని కితఁడు పినతండ్రి. ఇతని యితరగ్రంథములు: కారికాదర్పణము, కృష్ణాభ్యుదయము.

**అనంగదేవుఁడు** — చేదిదేశపు రాజు. హైహయ వంశమునందు జననమందెను. తండ్రి పేరు అర్జునుఁడు. రాష్ట్రకూట నృపాలుఁడు ఇంద్రుఁడీ యనంగదేవుని కూఁతును పెండ్లియాడెను.

**అనంగపాలుఁడు** — ఢిల్లీరాజు. తువర వంశమునందుఁ జివరివాఁడు. ఈతనికాలముననే యీతనిరాజధానికి 'ఢిల్లీ' యని పేరు గలిగెను. ఇతనికి పుత్త్రసంతానము లేదు. ఇద్దఱు కొమార్తె లుండిరి. అందు కమలాదేవి యనునామెను అజమీరురాజయిన సోమేశ్వరున కిచ్చెను. ఈమెకుమారుఁడే తరువాత ఢిల్లీశ్వరుఁడైన పృథ్వీరాజు. రెండవ కొమార్తె యగువిమలాదేవిని కనోజ్ రాజైన విజయపాలున కిచ్చిరి. ఈమెయే జయచంద్రునితల్లి. అనంగపాలుఁడు ముసలివాఁడై బదరికాశ్రమమునకుఁ బోవునపుడు తన ఢిల్లీ రాజ్యమును దౌహిత్త్రుఁడగు పృథ్వీరాజున కిచ్చెను.

**అనంగబ్రహ్మవిద్యావిలాసము** — ఇది యొక భాణము. శృంగారరసప్రధాన మయినది. రచయిత వాధూల వరదార్యుఁడు.

**అనంగభాగి** — ఒక బ్రహ్మర్షి.

**అనంగవిజయము** — శృంగారరసప్రధాన మగు నొకనాటకము. దీనిని రచియించినవాఁడు శివరామకృష్ణుఁ డను నతఁడు. నారాయణుఁ డనునతఁ డీశివరామకృష్ణునితండ్రి.

**అనంగాధరి** — ఉభయవక్రసంపూర్ణరాగము. ౩౯-వ మేళకర్తయగు ఝలవరాళిరాగజన్యము. ఆరోహణము: స రి గ రి మ ప ని ధ ని స; అవరోహణము: స ని ప ధ మ గ మ రి స యని సంచారముకలది.

**అనంగుఁడు** — ౧. శివునిచే భస్మముచేయఁబడిన తరువాత మన్మథునకు వచ్చినపేరు (చూడుఁడు: మన్మథుఁడు).

౨. రామసేనయందలి యొకవానరుఁడు.

**అనంత** — ౧. ఈపేరుగల సంస్కృతకవు లెందఱో కలరు. వారిలో నీక్రిందివారు ముఖ్యులు: (౧) ఉదయభాను కావ్యకర్త; (౨) కారకచక్ర రచయిత; (౩) చిదంబరాష్టకకారుఁడు; (౪) యోగామృతార్థచంద్రిక యను పాతంజలయోగసూత్రభాష్యమును రచియించినవాఁడు; (౫) వాక్యమంజరీరచయిత; (౬) విధ్యపరాధప్రాయశ్చిత్తప్రయోగరచయిత; (౭) వాజసనేయసంహితకు 'శుక్లదళభాష్యము'ను వ్రాసినవాఁడు; (౮) సాహిత్యకల్పవల్లి యను నలంకారగ్రంథమును గూర్చినవాఁడు; (౯) భీమని కుమారుఁడు, సైగేయార్చికానుక్రమమును వ్రాసినవాఁడు; (౧౦) మంత్రిమండల కుమారుఁడు; ౧౪౫౭-వ సంవత్సరమున కామసమూహ మహాప్రబంధము అను కామశాస్త్రమును రచియించినవాఁడు.

౨. వక్రషాడవ - ఔడవరాగము. పదునేడవ మేళకర్తరాగమగు సూర్యకాంతరాగజన్యము. ఆరోహణావరోహణములందు - రి స మ ప ధ ని స; స ప మ గ రి స యని సంచారము కలది.

**అనంతకవి** (చిత్రకవి) — ఇతఁడు పెమ్మసాని చినతిమ్మనాయని కాశ్రితుఁడు. పదునేడవ శతాబ్ది మొదటియర్ధమున నున్నవాఁడు. ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁడు. చిత్రకవి పెద్దనార్యుని పుత్త్రుఁడు. భారద్వాజసగోత్రుఁడు. ఇందుమతీపరిణయ మను ప్రబంధమును రచించెను. హరిశ్చంద్రనలోపాఖ్యానమునకును, విష్ణుచిత్తీయమునకును టీక వ్రాసినవాఁడు. ఆంజనేయోపాసకుఁడు.

**అనంతగిరి** — ౧. తూర్పుగోదావరి ఏజెన్సీజిల్లా, యెల్లవరంతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧౦౦ (౧౯౩౧).

౨. గంజాంజిల్లా పర్లాకిమిడి తాలూకాలోని జమీందారీగ్రామము. జనసంఖ్య ౧౩౧ (౧౯౩౧).

౩. గంజాంజిల్లా పర్లాకిమిడి తాలూకా జమీందారీగ్రామము. జనసంఖ్య ౨౦ (౧౯౩౧).

౪. గంజాంజిల్లా పర్లాకిమిడి తాలూకా జమీందారీగ్రామము. జనసంఖ్య ౧౪౩ (౧౯౩౧).

౫. గంజాంజిల్లా టెక్కలితాలూకాలోని ఈనాంగ్రామము. ఇచ్చటి జనసంఖ్య ౫౩౫ (౧౯౩౧).

**అనంతచ్ఛందస్సు** — (చూడుఁడు: అనంతామాత్యుఁడు).

**అనంతజిత్తు** — ఇరువదినలుగురు జినులలోఁ బదునాలుగవవాఁడు. ఇతఁడు వర్తమానావసర్పిణినుండి యావిర్భవించెను. ఇతని

తండ్రి సింహసేనుఁడు. తల్లి సుయశ. ఇతని 'చవణతిథి' (? గర్భ ప్రవేశతిథి) శ్రావణకృష్ణసప్తమి. జన్మతిథి వైశాఖ కృష్ణత్రయోదశి. ఇంచుమించుగ ఎనిమిదినెలలకు పైఁగ గర్భమునం దుండెను. కృత్తికా నక్షత్రముననుండి మీనరాశి నిర్గత మగుసమయమున నితఁడు అయోధ్యానగరమున జనియించెను. ఇతని శరీరప్రమాన మేఁబదిధనువులు. ఆయుర్మానము ముప్పదిలక్షలవర్షములు. దేహవర్ణము బంగారమువలె మెఱయుచుండెను. ఇతనికి రాజా అను ఉపాధి ఒసంగఁబడినది. ఇతనికి వివాహ మైనది. కాంపిల్యనగరమున నితనితోపాటు వెయ్యిమంది సాధువులకు దీక్ష దొరకినది. మాఘశుక్ల చతుర్దశినాఁ డితనికి దీక్ష ఇయ్యఁబడినది. ఇతనిది ఇక్ష్వాకుకులము. ఇతని గణధరు లేఁబదిమంది. ౬౬ వేలమంది సాధువులు. కేవలులు ౫ వేలు. శ్రావకులు ౨ లక్షల ౬ వేలు. శ్రావికలు ౪ లక్షల ౧౩ వేలు. వైశాఖ కృష్ణ చతుర్దశి ఇతని జ్ఞానతిథి. కాంపిల్య మితని జ్ఞాననగరము. ఇతని దీక్షావృక్షము అశోకము. ఇతఁడు కాయోత్సర్గమోక్షాసనస్థుఁడై చైత్ర శుక్లపంచమీదినమున ముక్తుఁ డయ్యెను. ఇతని మోక్షస్థానము సమేత శిఖరము. ప్రథమగణధరుఁడు-యశుఁడు. ప్రథమభార్య పద్మ.

**అనంతదీక్షితుఁడు** — విశ్వనాథదీక్షితుని కుమారుఁడు: వేదవిదుఁడు. ఇతఁ డాశ్వలాయనమతానుసారముగ సంస్కృతమున ప్రయోగరత్నము (స్మార్తానుష్ఠానపద్ధతి), మహారుద్రప్రయోగపద్ధతి యనుగ్రంథములను రచించెను.

**అనంతదేవుఁడు** — ౧. ఇతని కనంతపాలుఁడనియుఁ బేరు కలదు. కొంకణదేశపాలకుఁడు. ఆఱవవిక్రమాదిత్యుని సామంత ప్రభువులలో నొకఁడు. ఇతనిజనకుని పేరు నాగార్జునుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౦౯౫-వ సంవత్సరమున సింహాసన మెక్కెను. ఇతనికిఁ బశ్చిమసముద్రాధిపుఁ డను బిరుద ముండెను. స్థానకము, నాగపురము (నాగామ్), సూర్పరకము (సోపారము), చమూలీ (చౌల్) మొదలగు కొంకణమందలి రేవుపట్టణములకు వచ్చు బండ్లమీఁదిపన్ను ఇతని సమయమునఁ దీసివేయఁబడెను. దురదృష్టవశమున, బంధువర్గముల వైరకారణమున జనించి శక్తిమంతమై కొంకణభూమిని నాశనము గావించి దేవబ్రాహ్మణుల నిడుమలకుఁ బాలుచేసిన ఘోరపాపసమూహము నితఁడు తన ఖడ్గధారా సముద్రమున ముంచి రూపుమాపె నని యితని శాసనములం దితఁడు కీర్తింపఁబడినాఁడు. ఇందువలన అనంతదేవునికి పూర్వము వీరివంశములో నంతఃకలహము జనింప దానిని సందు చేసికొని గోపకపట్టణము(గోవా)పాలకులు కాదంబులు కొంకణములోని కొంతభాగమును జయించినట్లును, దరువాత నితఁడు ప్రబలుఁడై శత్రువులఁ బాఱఁదోలి, కోలుపోయిన భూమిని గొంతవఱకుఁ దనవశము చేసికొనినట్లును ఊహింపఁదగియున్నది.

౨. సుప్రసిద్ధుఁడగు భాస్కరాచార్యునితమ్మునిపౌత్రుఁడు. ఇతఁడు చాలిస్గ్రామమునందు భవానీదేవి పేర నొకదేవాలయమును గట్టించెను. ఇతని తండ్రి పేరు గణపతి. తాత శ్రీపతి భాస్కరాచార్యుని తమ్ముఁడు. ఇతఁడు, ౧౧౩౨-వ శకమున సింహాసన మెక్కిన దేవగిరియాదవరాజులలో నొకఁడగు సింహణుని సంస్థానపుజ్యోతిష్కుఁడుగ నుండెను.

౩. ఇతఁడు సంస్కృతమునందు 'సిద్ధాంతతత్త్వము', 'స్మృతికౌస్తుభము', 'సంస్కారకౌస్తుభము' మొదలయిన గ్రంథములను రచించెను. సిద్ధాంతతత్త్వ మనునది వేదాంతగ్రంథము. ఇతఁడు కూర్మాచలదేశాధిపతి యైన బాజబహదర్ బందునొద్ద నాశ్రితుఁడుగ నుండెను. ఈరాజు ౧౬౪౪ మొదలు ౧౬౬౪ వఱ కుండెను. ఈగ్రంథకర్తతండ్రి ఆపదేవుఁడు; ఆపదేవి (న్యాయప్రకాశః) అను పూర్వమీమాంససంబంధియైన యుద్గ్రంథమునకుఁ గర్త.

౪. ఇతఁడు బ్రహ్మగుప్తుని సిద్ధాంతమండలచ్ఛందశ్చిత్యుత్తర మనునధ్యాయముమీఁదను, బృహజ్జాతకము మీఁదను టీక వ్రాసినవాఁడు.

౫. కాశ్మీరదేశపురాజు. ఇతఁడు క్రీ. శ. ౧౦౨౮ మొదలు ౧౦౬౩ వఱకును ముప్పదయిదు సంవత్సరములు రాజ్య మేలెను. ఇతఁడు సంగ్రామరాజు (౧౦౦౩ - ౧౦౨౮) చిన్నకుమారుఁడు. ఇతనియన్న హరిహరరాజు ౨౨ దినములు రాజ్యము చేసి గతించినతోడనే ఇతనితల్లి దుర్మార్గవృత్తిగల శ్రీలేఖ రాజ్యము నాక్రమించుటకుఁ బ్రయత్నించెను. కాని రాజభటు లీతనినే సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టిరి. ఇతని పినతండ్రి కుమారుఁడగు విగ్రహరా జీతనిమీఁదికి దండెత్తి వచ్చెను గాని గతప్రాణుఁ డయ్యెను. ఇతని రాజ్యప్రారంభదశయందు శాహివంశజులయిన రుద్రపాల, దిడ్డపాలు [illegible] రాజునకుఁ బ్రియులై మిక్కిలి బలవంతు లైరి. రుద్రపాలుఁడు ఇందుచంద్రుఁ డను జాలంధరరాజ యొక్క పెద్దబిడ్డను బెండ్లి చేసికొనెను. అనంతదేవుఁ డా ఇందచంద్రునియొక్క చిన్నకూఁతురగు సూర్యమతిని బరిణయమాడెను.

ఊవరు లనువారు రాజుపైఁ దిరుగఁబడిరి. కంపనాధిపతి యగు త్రిభువనుఁడు వారికి నాయకుఁడుగ నుండెను. అనంతుఁడు యుద్ధమునకుఁ బోయి శౌర్యమును జూపి స్వయముగ త్రిభువనుని జంపెను. అశ్లే అచలమంగలుఁ డనురాజు ఏడుగురు మ్లేచ్ఛభూపాలురతో గలసి ఎత్తిరాఁగా రుద్రపాలునిసాహాయ్యంబున అనంతుఁడు వాని నోడించెను. రుద్రపాల దిడ్డపాలురు మరణము నొందినపిదప ననంతుఁడు తనభార్యయైన సూర్యమతిసాహాయ్యమున రాజ్యము చేయుచుండెను. ఈమె మిక్కిలి ధర్మాత్మురాలు. పెక్కు దేవాలయములు గట్టించి దానములు చేసెను.

రాజుమాత్రము గుఱ్ఱములు మొదలయినవానియం దెక్కువయాసక్తిగలవాఁడై ధన మెక్కువగాఁ గొల్ల వెట్టుటవలన అప్పులపా లాయెను. డల్లకుఁ డనునర్మసచివుఁడు రాజానుగ్రహమును సంపాదించి ప్రజలఁ

దోచుకొనుచుండెను. పద్మరా జను పరదేశీయుఁడు, తములపాకు లమ్మువాఁడు రాజున కెంతయో అప్పు పెట్టి అతనిసింహాసనమును గుదువ యుంచుకొనెను. అపుడు సూర్యమతి తనయొద్ద నున్నధనము నొసంగి రాజును ఋణవిముక్తుని జేసెను. అప్పటినుండియు రాజ్య భార మంతయు సూర్యమతియే వహించెను. అనంతదేవుఁడు పేరు నకుమాత్రము రాజుగా నుండెను. ఆమెప్రభుత్వమున 'హలధరుఁ' డనువాఁడు ముఖ్యమంత్రిగ నుండెను. ఇతఁడు మిక్కిలి జాగరూకతతో రాజ్యభారమును నడపెను. ఆకాలమున అనంతదేవుఁడు శాల, కంపాదిదేశముల జయించెను. ఉరశే, వల్లాపుర దేశాధిపతులపై దండువెడలఁబోయెను గాని పరాజితుఁడై తిరిగివచ్చెను. అనంతదేవుఁడు మనఃస్థైర్యము లేనివాఁ డగుటచే సూర్యమతి యనుమతి నాతఁడు ౧౦౬౩ లో రాజ్యమును తనకుమారుఁడైన కలశున కిచ్చివైచెను. కాని కలశునకును, అనంతదేవునకును పడనందున రాజు మరల రాజ్యభారము వహించుటకు ప్రయత్నించెను. తుద కీతఁడు క్రీ. శ. ౧౦౭౧ లో కుటుంబకలహమునకు విసివి ఆత్మహత్య గావించుకొనెను.

**అనంతదైవజ్ఞుఁడు** — జ్యోతిషశాస్త్రవేత్త. మహారాష్ట్రుఁడు. విఖ్యాతుఁడైన గణేశదైవజ్ఞునితమ్ముఁడు. ఇతఁడు శా. శ. ౧౪౫౬ జయనామసంవత్సరమున వరాహమిహిరకృత 'లఘుజాతకము'పై టీక వ్రాసెను. అది ఉత్పలకృతమైన వ్యాఖ్యకంటె లఘుతర మైన దనియు, సులభ మైన దనియు నీతనియభిప్రాయము.

**అనంతనహల్లి** — బళ్లారిజిల్లా, హర్పణహల్లి తాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౧౨౮ (౧౯౩౧).

**అనంతనారాయణుఁడు** — ౧. సుప్రసిద్ధుఁడగు దక్షిణదేశపు సంస్కృతకవి; ఆనందవల్లీస్తోత్రము, శరభోజచరిత్రము అను గ్రంథములు రచించెను.

౨. సుప్రసిద్ధుఁడగు తార్కికపండితుడు. కారికావళీతర్కసంగ్రహములకు టీక వ్రాసెను.

**అనంతనార్యుఁడు రేవూరి** — ఆంధ్రకవులచరిత్రయం దితనియింటిపేరు తాళవవా రని యున్నది. ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కాళహస్తికవి యితనితాత. లింగకవి యితనితండ్రి. ౧౭-వ శతాబ్ది పూర్వభాగమునందలివాఁడు. ఇతఁడు రచించినగ్రంథములు రెండు: గాధేయోపాఖ్యానము, వృద్ధాచల మాహాత్మ్యము. ఇందు మొదటిది బదిర కృష్ణభూపాలునకును, రెండవది పంట లింగాజీరెడ్డికి నంకితము. గాధేయోపాఖ్యానము అయిదాశ్వాసముల గ్రంథము. విశ్వామిత్రుని రాచఱికము మొదలుకొని వసిష్ఠునిచే బ్రహ్మర్షి యనిపించుకొనుటవఱకుఁ గల కథ యిం దతిప్రౌఢముగ సరళశైలిని వర్ణింపఁబడినది. వృద్ధాచల మాహాత్మ్యము క్షేత్రమహత్త్వమును దెల్పు నైదాశ్వాసముల సరసమైన గ్రంథము.

**అనంతపండితుఁడు** — భానుదత్తుని 'రసమంజరి'కి వ్యాఖ్య వ్రాసినవాఁడు; త్ర్యంబకపండితుని కుమారుఁడు; బాలోపండితుని పౌత్రుఁడు; నీలకంఠపండితుని ప్రపౌత్రుఁడు. ఈవంశము వారి నివాసస్థలము గౌతమీనదీతీరమునఁగల పుణ్యస్తంభము. దేశభాషయందు దానికి పుంటాంబేమ్ అని పేరు: అహమద్‌నగరజిల్లాయం దున్నది. అనంతపండితుఁడు రసమంజరీవ్యాఖ్యను శకవర్షము ౧౬౯౨ లో ఆప్పుడు కాశీనగరమును పాలించుచుండిన చంద్రభానుభూపతి యాజ్ఞ ననుసరించి కాశియందు రచియించెను.

**అనంతపంథీ** — సంయుక్తరాష్ట్రములయందలి రాయబరేలీ, సీతాపూర్‌జిల్లాలయందలి వైష్ణవులలో పునఃసంస్కారముఁ జెందిన వైష్ణవులసంప్రదాయము. వీరిసంఖ్య చాలఁ దక్కువ. పరమేశ్వరుఁ డొక్కఁడే యని నమ్మి యాతనిని అనంతదేవుఁ డనుపేర నారాధింతురు. ముండ్వాలోని సాధుమున్నాదాస్ అను సువర్ణకారుఁడు ఏతన్మతకర్త. కఱవుకాలమున నితఁ డెందఱనో కడుపుమంటనుండి కాపాడెనఁట. ఖేరీ, సీతాపూర్, బహరాయచ్ జిల్లాలయందలివా రెందఱో యితనికి శిష్యు లయిరఁట. మున్నాదాసు ఉపదేశించిన వైష్ణవమునకును, సాధారణ వైష్ణవమునకును ఎక్కువభేద మేమియు కన్పింపదు.

**అనంతపద్మనాభపురం** — ౧. చిత్తూరుజిల్లా కాళహస్తితాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౩౯.

౨. దీనికి గురమపేట గదబపాలెమను పేరును గలదు. విశాఖపట్టణముజిల్లా గోల్గొండతాలూకాలోని ఈనాంగ్రామము. ఇందలి జనసంఖ్య ౨౬ (౧౯౩౧).

**అనంతపల్లి** — పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెం తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౩,౭౪౪ (౧౯౩౧).

**అనంతపాలుఁడు** — కల్యాణము రాజధానిగఁ బాలించిన పశ్చిమచాళుక్యవంశజుఁడగు త్రిభువనమల్ల ఆఱవవిక్రమాదిత్యుని ప్రధానదండనాయకుఁడు: మహేశదండనాయకుని నలువురు తనయులలోఁ బ్రసిద్ధుఁడు. విక్రమాదిత్యసామంతుఁడుగ బెళ్వోళ ౩౦౦ లు, పులిగెఱె ౩౦౦ ల రాజ్యములను పాలించెను. వేంగిరాజ్యమును చాళుక్యచోళసామంతులు పాలించుచుండిన కాలమున నితఁ డారాజ్యముపయి నెత్తివచ్చి వారి నోడించి విక్రమాదిత్యుని పక్షమునఁ గొన్నివత్సరములు తద్రాజ్యమును పాలించెను. ఈతని శాసనములు కృష్ణా, గుంటూరుమండలములందును, గోదావరిమండలమునను గానవచ్చుచున్నవి. ఈతఁ డీరాజ్యము నేలుచు బెజవాడయందుండినకాలమున శ్రీపతిపండితుఁ డీతనికి గురుఁ డయి యుండెను (చూఁడుఁడు:

శ్రీపతిపండితుఁడు). అనంతపాలదండనాథుని శాసనములు క్రీ. శ. ౧౧౦౦ మొదలుకొని ౧౧౨౩ సంవత్సరములవఱకుఁ గాన్పించుచున్నవి.

**అనంతపురము** — ౧. మైసూరురాజ్యమునందలి యొకపల్లె. షిమోగాజిల్లాలోని సాగర్ తాలూకాలోనిది. షిమోగాకు ౨౯ మైళ్లమీఁద నుండును. అంధాసురుఁ డన్న రాజుచే నెనిమిదవ శతాబ్దియం దీగ్రామము కట్టింపఁబడియె. పదునొకండవశతాబ్దియం దిది చాళుక్యుల యధీనమునం దుండెను. ఇది 'సహస్రవిషయము'(మండలము)లోనిది. ౧౦౪౨లో నిది ౧౨౦౦ బ్రాహ్మణుల కగ్రహారముగ నీయఁబడెను. ౧౦౬౯లో నిది రాజధానిగఁ జెప్పఁబడెను. పదునేడవ శతాబ్దియందు, కేలడిరాజయిన వేంకటప్పనాయకుఁ డీగ్రామమునందు శివాచారమతమును స్థాపించెను. చంపకసరసు అనుచెఱువు త్రవ్వించెను. గ్రామముపేరు 'అనందపుర' మని మార్చెను. అదియే తరువాత ననంతపురముగ మాఱెను. హైదరు, టిప్పూలు ఈగ్రామముపై పెక్కుసార్లు దాడివెడలిరి. ౧౮౩౦లోని తిరుగఁబాటుకాలమున నీగ్రామము దోపిడికి లోనయ్యెను.

౨. అనంతపురము జిల్లాకు ముఖ్యపట్టణము. ఇది చెన్నపట్టణమునకు వాయవ్యమూలగ ౨౧౬ మైళ్లమీఁద నున్నది. ఇది చెన్నపురి దక్షిణమహారాష్ట్రపు ఇనుపదారి యొక్క గుంతకల్లు - బెంగుళూరుశాఖమీఁద నొకస్టేషన్.

ఈ గ్రామమును చిక్కప్పఒడయర్ అనునతఁడు కట్టించె నని చెప్పుదురు. ఈతఁడు విజయనగరరాజయిన ప్రథమబుక్కరాయలకు మంత్రిగ నుండెను. ఈ యొడయర్ ఒక పెద్దచెఱువు కట్టించి, దానికి రెండు అలుగులనుండి ఎక్కువైననీరు పోవుటకు రెండు కత్వాలును, వానికి సమీపమున రెండు గ్రామములును కట్టించెను. అందొక గ్రామమునకు రాజుపేరిట బుక్కరాయసముద్రము అని పేరు పెట్టి, రెండవదానికిఁ దనభార్యయైన అనంతమ్మపేరిట అనంతసాగర మని పేరు పెట్టెను. ఆపేరే అనంతపుర మని మాఱెను.

౧౮౦౦ లో దత్తమండలములు కంపెనీవారి క్రిందికి రాఁగా, ఆ ప్రదేశమునంతకును మన్రో అనువానిని కలెక్టరుగా నియమించిరి. అతఁడు అనంతపురమునందే తనకచ్చేరి యేర్పఱుచుకొనెను. ౧౮౨౨ లో కలెక్టరుకచ్చేరీ బళ్లారికిఁ దీసికొనిపోయిరి. ౧౮౨౩ లో మరల ఆ కచ్చేరి అనంతపురమునకు వచ్చెను. ౧౮౪౦ లో కలెక్టరు కచ్చేరిని బళ్లారికి మార్చి, అనంతపురములో సబ్‌కలెక్టరు ఉండఁజొచ్చెను. ౧౮౬౯ లో ఈకచ్చేరికూడ గుత్తికిఁ బోయెను. ౧౮౮౨ లో అనంతపురము స్వతంత్రముగ జిల్లా ఆయెను. అప్పుడిచ్చటికి మరల కలెక్టరు కచ్చేరి వచ్చెను.

ఇచ్చట జిల్లాకలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు, ఫారెస్టు ఆఫీసరు, లోకల్ ఫండ్ ఇంజినీరు, అనంతపురం డివిజనును పాలించు హెడ్‌క్వార్టరు డిప్యూటీకలెక్టరు, అనంతపురంతాలూకా తహసీలుదారువారల కార్యస్థానము లుండును. ఇచ్చట డి. పి. డబ్ల్యు అసిస్టెంటు ఇంజనీరు, సాల్టు - అబ్కారీ - కస్టమ్సు ఇన్‌స్పెక్టరు, సబ్‌రిజిస్ట్రారు, ఎష్యూరెన్సుల జిల్లా రిజిస్ట్రారు, విద్యాధికారి, ఇంకమ్‌టాక్సు ఆఫీసరు, జిల్లా ఆరోగ్యాధికారి (... ఆఫీసరు), పోలీసు డిప్యూటీసూపరింటెండెంటు, సహకారసంఘముల (కో ఆపరేటివ్ సొసయిటీలు) అసిస్టెంటు రిజి... కూడ నుందురు. జిల్లాకోర్టు, సెషన్సుకోర్టుకూడఁ గలవు. యన్నియు కాక గవర్నమెంటు ఫస్టుగ్రేడు కళాశాల, రిక్రూయిట్లస్కూలు - వీనితో దీనికి ప్రాముఖ్యము మఱియు ... నది. జనసంఖ్య ౧౫,౦౯౯. ఈగ్రామమున చెప్పఁదగిన వి... 'రాబర్ట్‌సన్ స్క్వేర్' అను చౌకము. అనంతపురమున కలెక్టరు ౧౮౩౭ న అచ్చటనే మరణమునొందిన రాబర్ట్‌సన్ అనువా... ఈ చౌకము నిర్మితమయినది. రాబర్ట్‌సన్ బ్రతికియున్నప్పు... చౌకము నేర్పఱిచి, నడుమ నున్న కోట, కందకము పూ... నడుమ మండపమును గట్టించి, చుట్టు తనచేతితో చెట్లు నా... వీనిలో దాదాపుగ అన్నియు నశించిపోయినవి. గుడి కెదురుగ విశాలమైన పెద్దచౌక మిప్పుడు దానిచుట్టుపట్లఁ గల పాఠశా... విద్యార్థులకు క్రీడారంగముగ నుపయోగపడుచున్నది. 'రాబ... స్క్వేరు' చుట్టు నున్న కట్టడములలో గవర్నమెంటు ఆ... ఉపాధ్యాయులకు ఉపాధ్యాయినులకు బోధనాభ్యసన కళా... (Training Schools), బాలబాలికలకు ఉన్నతపాఠశాలలు దగినవి. ఈచౌకమున కుత్తరమున ప్రాఁతకోట యుండెను. బురుజుల విశేషములును, కందకపు పల్లములును ఇప్పటికిని వచ్చును. ప్రాఁతకోట యున్న ప్రదేశమున నిప్పుడు 'జూబిలీ పా... అను పౌరోద్యాన మున్నది. వారమువారము జరుగుసంత ... జరగును. అనంతపురము పరిశుద్ధముగను, చక్కఁగను ఉండును.

౩. అనంతపురంజిల్లా ... తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౪౧౩ (౧౯౩౧).

౪. అనంతపురంజిల్లా శిరతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪౯౩ (౧౯౩౧).

౫. చిత్తూరుజిల్లా మ... తాలూకాయందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౬౦ (౧౯౩౧).

౬. కడపజిల్లా జమ్మల... తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౫౩౫ (౧౯౩౧).

౭. కడపజిల్లా ప్రొ... తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౧౯౫ (౧౯౩౧).

— (రాళ్ల) అనంతపు... కల్యాణదుర్గంతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౬౧౮ (౧౯...

— (లక్కిరెడ్డిపల్లి ... జిల్లా రాయచోటితాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ... (౧౯౩౧). ఫిబ్రవరిమాసమున జరగు గంగజాతరకు జను... వచ్చెదరు.

**అనంతపురము జిల్లా** — ఇది చెన్నరాజధానియందలి యొకతెలుఁగుజిల్లా. ఇప్పుడు రాయలసీమ (పూర్వపుదత్తమండలములు) అనఁబడు జిల్లాలలో నిది దక్షిణపుది. పూర్వము బళ్లారిజిల్లాలోనే అనంతపురముకూడ కలసియుండెను. బళ్లారినుండి దీనిని ౧౮౮౨ లో వేఱుచేసిరి. దీని కుత్తరమున బళ్లారి, కర్నూలుజిల్లాలును, తూర్పున కడపజిల్లాయును, దక్షిణమున మైసూరురాజ్యమును చిత్తూరుజిల్లాలును, పడమట మైసూరురాజ్యమును బళ్లారిజిల్లాయును గలవు. ఇందు పూర్వము అనంతపురము, ధర్మవరము, గుత్తి, హిందూపురము, కల్యాణదుర్గము, మడకశిర, పెనుకొండ, తాడిపత్రి అను నెనిమిదితాలూకాలే యుండెను కాని ౧౯౧౦-వ సంవత్సరమున నూతనముగ చిత్తూరుజిల్లా యేర్పడినప్పుడు కదిరితాలూకా నిందుఁ గలుపుటవలన నిప్పుడు తొమ్మిదితాలూకా లయినవి.

## భూస్వభావము

అనంతపురముజిల్లా సమప్రదేశముకలది కాదు; ఉన్నతప్రదేశము. ఇది మైసూరుపీఠభూమి చివరిభాగము. దక్షిణమువైపు ఉన్నతముగను, పోనుపోను ఉత్తరమువైపు పల్లముగను నుండును. దక్షిణపువైపుప్రదేశము ౨,౨౦౦ ల అడుగులయెత్తున నున్నది. బళ్లారికిని గుత్తికిని నడుమ నున్న రేఁగటినేల యెత్తు ౧,౧౮౨ అడుగులు; తూర్పుభాగమున తాడిపత్రియొద్ద ౯౦౦ అడుగులు.

భూస్వభావమునుబట్టి యీజిల్లాను ఉత్తర, దక్షిణ మధ్యవిభాగము లని మూఁడు విభాగములు చేయవచ్చును. గుత్తి, తాడిపత్రి తాలూకాలు కలసినది ఉత్తరవిభాగము. ఇందు ప్రత్తిపంట కనువయిన రేఁగటిభూమి చాల ఎక్కువ. అనంతపురము, కల్యాణదుర్గము, ధర్మవరము, పెనుకొండతాలూకాలు మధ్యవిభాగములోనివి. కదిరికూడ ఇందే చేరును. ఇందలిది గొడ్డుభూమి: ఱాతియెఱ్ఱనేల. చెట్టుచేమ పెరుఁగదు. కదిరియం దంతట చెట్టుచేమ పెరుఁగనిగుట్టలు కలవు. హిందూపురము మడకశిరతాలూకాలు కలసి దక్షిణవిభాగ మనవచ్చును. ఇది మధ్యవిభాగమంత పాడుది కాదు. ఇందలి యెఱ్ఱనేల నడిమివిభాగమునందలిదానికంటె మంచిది. హిందూపురము, మడకశిరతాలూకాలలో నీటివసతి యెక్కువ. ఇందు కొబ్బరి, పోఁకతోఁటలు కలవు. ఈతోఁటలవలన మడకశిర ఈజిల్లా కంతకు ఆరామ మన్న పేరు గడించినది కాని చాలసంవత్సరములనీటివఱుపువలన పోఁక, కొబ్బరితోఁటలు చెడి దాని కాపేరు పోవుచున్నది.

## కొండలు : కనుములు

ఈజిల్లాలో మిక్కిలి ఎత్తయినకొండలు లేవు. ఉన్న వెల్ల గుట్టలు. ఈజిల్లాయందు మిక్కిలి యెత్తయినవి — మల్లప్పకొండ. ఇది పెనుకొండతాలూకా బుక్కపట్టణమున కుత్తరముగ నాలుగుమైళ్ల దూరమున నున్నది. దీనియెత్తు ౩,౦౯౨ అడుగులు; పెనుకొండ కొండ - దీనియెత్తు ౩,౦౯౧ అడుగులు. కుందుర్పిదుర్గము: ఎత్తు ౨,౯౯౬ అడుగులు. మడకశిరకొండ ౨,౯౩౮ అడుగులయెత్తు. కదిరితాలూకాయందలి ఈశ్వరమలయ: ఎత్తు, ౩,౧౬౯ అడుగులు. ఇవి సముద్రపుమట్టమునకంటె ౧,౫౦౦ లు మొదలు ౨,౦౦౦ ల అడుగులయెత్తున నున్నప్రదేశమున నున్నవి. జిల్లాయందలి యైదు స్థలములందుమాత్ర మీగుట్టలు పంక్తులు తీర్చియున్నవి. ఈయైదును ఉత్తరదక్షిణములఁ బోవును. వీనిలో ముచ్చుకోటకొండ లనునవి తాడిపత్రితాలూకాకును గుత్తి అనంతపురముతాలూకాలకును మధ్యగ వ్యాపించినవి. వీనిపొడవు ౩౫ మైళ్లు: చాలచోట్ల వీనివెడల్పు ఏడు మైళ్లు. నాగసముద్రముకొండ లనునవి గుత్తితాలూకాకు మధ్యగఁ బోవును. వీనిపొడవు ౫౦ మైళ్లు: కాని యీవరుస చాలచోట్ల తెగిపోయినది. పైని చెప్పిన అయిదింటిలో ముఖ్యమైనది మల్లప్పకొండలచాలు. ఇది పెనుకొండతాలూకా తూర్పుభాగము నాక్రమించినది. ఇది ధర్మవరమునొద్ద నారంభమయి జిల్లా దాఁటి మైసూరురాజ్యములోనికిని, కడపజిల్లాలోనికినిగూడ వ్యాపించినది. పెనుకొండతాలూకాయందలి మఱియొకకొండలచాలు పెనుకొండకొండలు. ఇది ధర్మవరమునకు దక్షిణమున ఆరంభమయి పెనుకొండ, హిందూపురంతాలూకాలగుండ మైసూరురాజ్యములోనికి దక్షిణముగ ౮౦ మైళ్లదూరము వ్యాపించియున్నవి. పెనుకొండకొండదగ్గఱ ఒక్కచోటమాత్ర మీవరుస తెగిపోయినది. మడకశిరకొండలు ఆతాలూకాయందు తూర్పుపడుమరలుగ వ్యాపించి దానిని ఉత్తరదక్షిణవిభాగములుగ వేఱుచేయుచున్నవి. తాడిపత్రితాలూకాతూర్పుభాగమున కర్నూలు - ఎఱ్ఱకొండలు వ్యాపించినవి. ఇవికాక విడివిడికొండలు పెక్కులు కలవు. ఇట్టివానిలో గుత్తికొండ, అనంతపురంగుత్తి తాలూకాలనడుమనున్న గంపమల్లకొండ పేర్కొనఁదగినవి. కల్యాణదుర్గము, ధర్మవరముతాలూకాలలోఁ జిన్నకనుమ లయిదాఱు కలవు. కదిరితాలూకాయందలి దోర్నాలకనుమ, బొంతలపల్లికనుమ, తుమ్మలమల మన్నగు భయంకరములయిన కనుములు కలవు.

## నదులు

ఈజిల్లాలోఁ బ్రవహించునదులలో పెన్న ముఖ్యమయినది. ఇది మైసూరురాజ్యమునందుఁ బుట్టి, హిందూపురం తాలూకా దక్షిణమున ఈజిల్లాయందుఁ బ్రవేశించును. అచ్చటనుండి నూటిగ నుత్తరము దిక్కు ౮౦ మైళ్లు ప్రవహించి, ఉడిపి (పెన్నహోబలము) యొద్ద, చక్రన తూర్పునకుఁ దిరిగి రమారమి ౫౦ మైళ్లు ప్రవహించి వంగనూరుగ్రామమునకు నుత్తరమున నొకమైలుదూరమున కడపజిల్లాలోఁ బ్రవేశించును. ఈజిల్లాయందలి తొమ్మిదితాలూకాలలో నిది యేడు తాలూకాలగుండ ౧౩౦-౧౮౦ మైళ్లప్రదేశమునఁ బ్రవహించును. పామిడిగ్రామమునకు దక్షిణముగాఁ బాఱెడు ఈనదికి నడుమ నొక శివాలయము - గోపురశోభితముగఁ గట్టఁబడినది.

చిత్రావతి — ఇది పెన్నకు నుపనది. మైసూరురాజ్యమునఁ బుట్టి ఆగ్నేయదిక్కున ఈజిల్లాలోఁ బ్రవేశించి, హిందూపురము, పెను

# అనంతపురము జిల్లా

కొండ, ధర్మవరము, తాడిపత్రి తాలూకాలలోనుండి ౯౨ మైళ్లు ప్రవహించి కడపజిల్లాలోఁ బ్రవేశించును.

పై నుడివినవి కాక పెన్నేటి కుపనదులయిన జయమంగలీ, కుశీవతులు, హగ్గరిలోఁ గలయుస్వర్ణముఖి, కదిరితాలూకాయందలి మద్దలేఱు, పాపఘ్ని అను చిన్నయేళ్లు కలవు. వ్యవసాయమున కుపకరించు జలాధారములుగ నివి యంత యుపయోగకరము లైనవి కావు. సంవత్సరమంతటిలో చిత్రావతి, పెన్ననదులలో పరిమిత దినములుమాత్రమే నీ రుండును. ఈకారణమున సంవత్సరమునఁ జాలభాగము పైరు లుండవు.

## గనులు

గుత్తితాలూకా వజ్రకరూరుగ్రామసమీపమున భూమిపై భాగముననే యెప్పుడైనను వజ్రములు దొరకుచుండును. అవి యెచ్చటి నుండి పుట్టునో తెలియలేదు. ధర్మవరముతాలూకా రామగిరిగ్రామము దగ్గఱ నున్న కొండలలో బంగారుగని యొకటి తొంబదేండ్లక్రిందట మారిసన్ అను పాశ్చాత్యుఁడు కనిపట్టినాఁడు కాని యది లాభప్రదమయినదికాదు. 'నార్త్ అనంతపూర్ గోల్డ్ మైన్స్ కంపెనీ' అను పేర నొకసంఘము ౧౯౦౯ లో నేర్పడి ౧౯౨౫ వఱకు గుత్తి తాలూకా, రామపురముగ్రామప్రాంతమున బంగారుకొఱకు పనిచేసినది. కాని ౧౯౨౭ లో ఆకంపెనీ దివాలా తీసినది.

ఇండ్ల కుపయోగపడురాళ్లు అచ్చటచ్చట దొరకును. తాడిపత్రి తాలూకాయందలి రాయలచెఱువునొద్ద బలపపురాయి దొరకును. వానితో పాత్రలు చేయుదురు.

## అడవి

౧౯౨౯ - వ సంవత్సరము, జనవరి మొదటితేదినాఁటి కనంతపురంజిల్లాయందుఁగల యడవివిస్తీర్ణము 'తాలూకావారి'గా నీక్రిందఁ జూపఁబడినది :

| తాలూకా | చ. మైళ్ల యడవి | మొత్తమువిస్తీర్ణమున నూటికి |
|---|---|---|
| గుత్తి | ౫౯ | ౭ - వ వంతు |
| తాడిపత్రి | ౭౫ | ౧౨ ,, ,, |
| అనంతపురం | ౭౪ | ౯ ,, ,, |
| ధర్మవరం | ౪౨ | ౮ ,, ,, |
| కల్యాణదుర్గం | ౪౫ | ౮ ,, ,, |
| పెనుకొండ | ౧౨౦ | ౧౯ ,, ,, |
| హిందూపురం | ౪౦ | ౯ ,, ,, |
| మడకశిర | ౩౪ | ౯ ,, ,, |
| కదిరి | ౨౧౮ | ౧౯ ,, ,, |
| జిల్లామొత్తము | ౭౦౫ | ౧౨ ,, ,, |

బళ్లారి, కడపజిల్లాలయందలి పడుమటితాలూకాలలోవలెనే యిచ్చటి యరణ్యములలోఁగూడ పెద్దచెట్లు పెరుఁగవు. జిల్లాయందలి యుత్తర, మధ్యమవిభాగములందు దక్షిణవిభాగమునందు కంటె అడవి తక్కువ. దక్షిణవిభాగము మైసూరుపీఠభూమి కొన యగుటవలన దేశము ఎత్తు ఎక్కువ. అదియునుగాక అచ్చటి కొండనేల జిల్లాయందలి యితరభాగములం దున్నదానికంటె సారవంత మయినది. అనంతపురం, తాడిపత్రి తాలూకాలనడుమ నున్న ముచ్చుకోటకొండలలో యేపిచెట్లు విశేషముగ పెరుఁగును. ఈయడవియందుఁ బెరుఁగుయేపి హిందూదేశమునం దంతట దొరకు కలపలో మిక్కిలి గట్టిది; మిక్కిలి బరువయినది. జిల్లాయంతటిలో వేఱువేఱురకములచెట్లు, పెరుఁగుదల విశేషముగఁ గల యడవి దక్షిణ విభాగమున, అందు ముఖ్యముగ కొత్తకోట, అమగొండపాళయం ప్రాంతములఁ గలదు. ఈ కొత్తకోట, అమగొండపాళయం రిజర్వు అడవులు జిల్లాయంతటిలో బాగుగ వృద్ధిలోనికి రాఁగలవు. మంచిగంధపుచెట్లును ౧౯౦౪ లో ఈజిల్లాకుఁ దీసికొనివచ్చినాఁటిరి. ఇవి క్రమముగ వృద్ధిపొందుచున్నవి. యేపి (ముఖ్యముగా నిది కొత్తకోటరిజర్వు అడవిలోను), టేఁకు, బిల్లుమ్రాను విశేషముగఁ గలదు: ఈ మండలమునందలి టేఁకు అంత యెత్తుగఁ బెరుఁగదు. గిడసబాఱి యుండును. ఇవికాక కొండలమీఁద చాలచోట్ల వెదురు పెరుఁగును.

అడవులను రక్షింపవలసిన ప్రాముఖ్యమును రైతులు గుర్తించిరని తెలిసికొన్నపిదప గవర్నమెంటువారు ౧౯౧౪ న కొన్నికొన్ని జిల్లాలలో సామాన్యరక మయినయడవిని ఎట్లు చక్కఁబెట్టెదరో చూత మని పంచాయతులవశము కావించిరి. ఒక్కొక్కగ్రామమునకో, మొత్తముమీఁద కొన్నికొన్నిగ్రామములకు కలిపియో పంచాయతు లేర్పాటు చేసిరి. చాలపంచాయతు లటవీవ్యవహారములను సరిగా చక్కఁబెట్టుచున్న వని గవర్నమెంటువారికి సంతృప్తి కలిగినది. గవర్నమెంటువా రీపంచాయతీపద్ధతిని ౧౯౨౬ న ఈజిల్లాకు వర్తింపఁజేసినారు. ఈజిల్లాయందలి చాలరిజర్వు అడవులు పంచాయతులవశమునకు వచ్చినవి. ౧౯౨౯ - వ సంవత్సరమున పంచాయతులవశమున నుండినవి, అటవీశాఖవారియధికారమున నుండినవి ఈక్రిందిరీతిని గలవు :

| తాలూకా | అడవి విస్తీర్ణము చ. మైళ్లు | పంచాయతుల వశముననున్న అడవి చ. మైళ్లు | అటవీశాఖ వారియధికారమున నున్న యడవి చ. మైళ్లు |
|---|---|---|---|
| గుత్తి | ౫౭ | ౫౭ | ,, |
| తాడిపత్రి | ౭౪ | ౭౪ | ,, |
| అనంతపురం | ౭౪ | ౭౪ | ,, |
| ధర్మవరం | ౪౪ | ౨౯ | ౧౫ |
| కల్యాణదుర్గం | ౪౫ | ౪౫ | ,, |
| పెనుకొండ | ౧౨౦ | ౪౬ | ౭౪ |
| హిందూపురం | ౪౧ | ౨౯ | ౧౨ |
| మడకశిర | ౩౪ | ౩౪ | ,, |
| కదిరి | ౨౧౮ | ౫౯ | ౧౫౯ |
| మొత్తము | ౭౦౪ | ౪౪౫ | ౨౫౯ |

పుల్లరివలనను, అడవిఫలసాయమువలనను కడచిన అయిదేండ్లలో నెంతటిరాబడి వచ్చినదో సగటున లెక్కవేసి దానినిబట్టి యేఁటేఁట నింతశిస్తు చెల్లింపవలె ననునిర్ణయముతో గవర్నమెంటువారడవిని పంచాయతుల కొప్పగించిరి. ఇంకను మఱికొన్ని షరతులు కలవు; అవి యేవన, ఎడపఁదడప పశువుల 'సొంతదారు'లను సమావేశపఱచి సభలు చేయుచుండవలెను. అట్టిసభలలో వారియామోదమునిమిత్తము పంచాయతీలెక్కలను బ్రవేశపెట్టవలెను. ఖర్చులు పోను మిగిలినలాభమును ముందుగా గ్రామమునందలి యడవిని పెంపొందించుట కుపయోగింపవలెను. అటుతరువాత నింకను సొమ్మున్నచో పంచాయతీగ్రామములలో ప్రజోపయోగకరములైన కార్యములేవైన నున్న వానికి వెచ్చింపవలెను. అగ్నివలనఁగాని మఱియే యితరకార్యములవలనఁగాని అడవిపెంపునకు భంగము కలుగకుండ నిరోధింపవలెను. అడవిసరిహద్దుచిహ్నములు సరిగా కాపాడవలెను. తొలకరివానలు పడినరెండుమాసములవఱకు అడవులలో పశువులను మేఁతకు వదలఁగూడదు. ఎన్నిపశువులను మేఁతకు వదలవచ్చునో, ఎన్నిచెట్లను గొట్టవచ్చునో ఈమొదలయినవి గవర్నమెంటువారి చట్టముల ననుసరించి పంచాయతివారు నిర్ణయించుదురు.

పైని చూపినపట్టిక ననుసరించి ౧౯౨౮ వ ౧౧౨ అటవీపంచాయతుల క్రింద ౪౪౫ చ. మైళ్ల యడవి యుండెను. ఈయడవికి పంచాయతులనుండి గవర్నమెంటువారికి మొత్తముమీఁద రు. ౧౧,౭౯౯ ల శిస్తు చెల్లినది. ఈపంచాయతులు సరిగ పని చేయుచున్నది లేనిది మొదట ఫారెస్టుపంచాయతీఆఫీసరు కనుఁగొనుచుండెను; కాని ౧౯౨౮-వ జనవరి ౧-వ తేదీ లగాయతు ఈయధికారము జిల్లారివిన్యూవర్గమువారికి వశపఱుపఁబడినది. ఈ పంచాయతులపనిని కనుఁగొనుట కిరువురు డిప్యూటీతహసీలుదారులు నియమితులైరి. ఒకరు అనంతపురమునను మఱియొకరు పెనుకొండయందు నుందురు.

## వర్షపాతము : శీతోష్ణస్థితి

జిల్లాయందలి పంటపైరులు ప్రధానముగ వర్షాధారములు. ఒక్క బళ్లారిజిల్లాను మినహాయించినయెడల చెన్నరాజధానియందలి యేయితరజిల్లాయందుకంటెను వర్షపాత మీజిల్లాయందుఁ జాల తక్కువ. అనంతపురము జూన్, జూలై, ఆగష్టు, సెప్టెంబరు మాసములలో తొలకరివానలు, అక్టోబరు, నవంబరు, డిశెంబరుమాసములయందలి తూర్పువానలు కురియుప్రదేశమున నున్నది కాని ఏవానలును చక్కఁగఁ గురియవు. సాధారణముగ ఈజిల్లాయందు ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరుమాసములలో వాన లెక్కువగఁ గురియును. కడచిననలువదియేండ్లకాలమున ఈజిల్లాయందుఁ గురిసినవాన లెక్కవేసి చూడఁగా సగటున సంవత్సరమునకు ౨౨ అంగుళములపై చిలుకు కురిసినట్లు తేలినది. జిల్లాతాలూకాలలో పెనుకొండతాలూకాయందు వర్షమధికము; కదిరితాలూకాయం దల్పము. హిందూపురము, అనంతపురము, ధర్మవరము, తాడిపత్రి, గుత్తి, మడకశిరతాలూకాలయందు జిల్లామొత్తముమీఁద సగటునఁబడినవర్షముకన్న నెక్కువ; కల్యాణదుర్గము, కదిరితాలూకాలయందు జిల్లాసగటునఁ దేలినలెక్క కంటెఁ దక్కువవర్షము కురిసినది. అది యటుండ నీవర్షపాతము జిల్లాయం దంతట సమముగ నుండక యొకచోట నెక్కువగాను, ఒకచోట తక్కువగాను ఉండును. వర్షములు సరిగాఁ గురియక కఱవుకాటకములు తఱచు సంభవించుచుండును.

ఆర్ద్రతయందును, తాపపరిమాణమునను ఈజిల్లా బళ్లారివలె నుండును. మార్చి, ఏప్రిల్, మే మాసములు మంచి యెండకాలము. చెన్నరాజధానియందలి యితరజిల్లాలయందుకంటె నిచ్చట ఎండ లధికము. మృగశిరప్రవేశముతో జూన్‌మాసముననుండి ఎండలు తగ్గును. అప్పు డిచ్చటికాలమానస్థితి యితరజిల్లాలలోకంటె ఎక్కువ బాగుగ నుండును. జిల్లాయందలి యుత్తరపువైపుభాగమునకంటె దక్షిణపువైపుభాగ మెక్కువ చల్లఁగ నుండును.

## చెఱువులు

ఈజిల్లాలో ౧౬౨ చెఱువులు కలవు. వానిలో బుక్కపట్టణముచెఱువు, ధర్మవరముచెఱువు, సింగనమలచెఱువు అనునవి ముఖ్యమయినవి. మొదటిరెండును చిత్రావతీనదికి నడ్డకట్టవేసి నిర్మింపఁబడుటచేత వానికి నీటివసతి విశేషముగ నుండును. మిగిలినచెఱువులన్నియు వర్షములు బాగుగనున్న నిండును; లేనిచో లేదు. సగటున కొన్నిసంవత్సరములకు లెక్కవేసి చూడఁగా ఉన్నచెఱువు లన్నిటిలో ఎనిమిదివంతులలో నొకవంతు నిండునని, రెండువంతుల చెఱువులలో నీళే యుండ దని, అయిదువంతులు అసంపూర్తిగ నిండు నని తేలినది. ఈచెఱువులక్రింద జరగువ్యవసాయము చాలవఱకు మెట్ట.

రు ౫,౦౦౦ ల శిస్తుకు పైన వచ్చు ఆయకట్టుపరిమితిగల చెఱువు లీక్రిందిపట్టికయందుఁ జూపఁబడినవి.

| చెఱువు | ఆయకట్టు | శిస్తు |
|---|---|---|
| అనంతపురముతాలూకా | | |
| ఆనంతపురం చెఱువు | ౨,౧౭౯ | ౧౩,౬౦౩ |
| సింగనమలచెఱువు | ౨,౪౪౨ | ౧౪,౭౮౧ |
| ధర్మవరముతాలూకా | | |
| ధర్మవరము చెఱువు | ౧,౭౪౭ | ౧౫,౩౬౮ |
| గుత్తితాలూకా | | |
| గుత్తిచెఱువు | ౬౫౮ | ౭,౫౩౦ |
| యెఱతిమ్మాజుచెఱువు | ౮౯౦ | ౬,౩౦౧ |
| హిందూపురంతాలూకా | | |
| పరిగిచెఱువు | ౨,౬౪౩ | ౧౪,౧౯౩ |
| కల్యాణదుర్గంతాలూకా | | |
| కంబాడు చెఱువు | ౯౦౭ | ౫,౪౬౮ |

| | | |
|---|---|---|
| మడకశిరతాలూకా | | |
| మొరుబాగలు చెఱువు | ౧,౧౩౩ | ౬,౧౮౩ |
| అమరాపురం చెఱువు | ౫౩౧ | ౬,౨౫౦ |
| అగళి చెఱువు | ౮౮౪ | ౨౪,౫౮౧ |
| పెనుకొండతాలూకా | | |
| బుక్కపట్టణం చెఱువు | ౩,౩౫౪ | ౨౩,౬౭౩ |

## వృత్తులు : పరిశ్రమలు

రాయలసీమయందలి యితరజిల్లాలలోవలెనే ఈ జిల్లాయందు కూడ ప్రజలకు ప్రధానజీవనాధారము వ్యవసాయము. ఈవృత్తికి తోడు పశువులమందలను గొఱ్ఱెలమందలను పెంచుటకూడఁ గలదు. కుమ్మరము, కమ్మరము, వడ్రంగము మొదలయిన చేతిపను లటుండ ప్రధానమయిన పరిశ్రమ నేఁత. వేసవికాలమున వ్యవసాయపుఁ బని యేదియు నుండనిదినములలో ముఖ్యముగ గుత్తి, తాడిపత్రితాలూకాల యందలి కాఁపులు, మహమ్మదీయులు, దూదేకులవాండ్రు, మాల, మాది గలు నేఁత నేయుదురు. దాదాపుగ ప్రతిగ్రామమునను రాట్నములు కలవు. కాని వ్యవసాయపు పనితొందరలు లేనికాలముననే వానికి పని కలుగును. దుప్పటులు, సాధారణముగ రైతులు కట్టుకొను ముతక బట్టలు, స్త్రీలు కట్టుకొను రంగుచీరలు ఎక్కువగ ఈజిల్లాయందు నేయుదురు. రవికలకు తలపాగలకు పనికివచ్చు బట్టకూడ కొంత తయారగును. ఉరవకొండ, తాడిపత్రి, ధర్మవరములు ఈ నేఁత పరిశ్రమసాగు ప్రధానస్థలములు. ప్రధానముగ దేవాంగులు, తొగట వారు, సాలీలు నేఁత నేయుదురు. అచ్చటచ్చట మహమ్మదీయులును, మాలవాండ్రునుకూడ నేఁతనేయుట కలదు. నేఁత కుపయోగించు దారము కొంచె మించుమించుగ నంతయు యంత్రముమీఁద తయారయినదే. పట్టుబట్టలు, చీరలు ముఖ్యముగ ధర్మవరమున నేయుదురు. నేఁతపరిశ్రమ ఉరవకొండయందు పూర్వముకంటె చాల తగ్గినది. ఇచ్చట తయారగు నీలిరంగుబట్టలు కాఫీతోఁటలలోఁ బనిచేయు కూలీలకు మల్నాటి కెగుమతి యగును. పామిడి చౌలూరుగ్రామము లందును, కొంతవఱకు పెనుకొండ, గుట్టూరుగ్రామములందును చేతితో బట్టల కద్దకము వేయుదురు. లంబాడీస్త్రీల కుపయోగపడు చీటీబట్ట లును, బర్మా, పినాంగు, సింగపూరు, దక్షిణహిందూదేశము, బొంబాయి బజారులలో చెల్లుబడియగు చీటీబట్టలునుమాత్రమే యిచ్చట తయారగుచున్నవి. కలంకారియద్దకము నశించినది. ముఖ్యముగ కల్యాణ దుర్గము తాలూకాయందును, గుత్తి అనంతపురము తాలూకాల లోని కొన్ని భాగములయందును కంబళ్లు నేయుదురు. ఈజిల్లా యంతలో తనగల్లు, బెళుగుప్పగ్రామములయందు తయారగు కంబళ్లు ప్రశస్తమైనవి. ఇక్కడ తయారగుకంబళ్లు బళ్లారి కెగుమతి యగును. ఈజిల్లాయం దింకను గాజులు తయారుచేయుగ్రామము పెనుకొండ కెనిమిదిమైళ్ల దూరమున నున్నగుట్టూరు. క్షారమయ మయిన మట్టితో నీగాజులు చేయుదురు. ఈకారణమున దీనికి గాజులగుట్టూ రని పేరుండెడిది. ఒకప్పు డిచ్చట గాజులు తయారుచేయువా రేడువందల వఱకు నుండిరి. ఇప్పు డీపరిశ్రమ క్షీణించినది. ధర్మవరమునకు పదు నైదుమైళ్లదూరమున నున్న న్యామద్దలగ్రామమున నొకప్పుడు ముతక కాగితము తయారు చేయువారు. ఇప్పు డీపరిశ్రమయు క్షీణించినది. హిందూపురముతాలూకా చిలుముత్తూరుగ్రామమున నూలుతోను, పట్టుతోను పటకాలును, కొడికొండగ్రామమున కత్తిరుద్వైనలును తయారగుచున్నవి. తిమ్మనచెర్ల, గుంతకల్లు, తాడిపత్రిగ్రామము లందు ప్రత్తియేకి మూటలు కట్టుప్రత్తిఫ్యాక్టరీలు చాలకాలమునమండి యున్నవి. వీనిలో ఆవిరితో పనిచేయఁబడును.

## వర్తకము : ఎగుమతి, దిగుమతులు

ప్రత్తి, ఉలవలు, ఆహారపదార్థములు, దుప్పటులు, చీరలు, తంగేటిచెక్క ఇచ్చటి ముఖ్యమయిన యెగుమతులు. ఉప్పు, కిరస నాయిలు, పరదేశపునూలు, పరదేశపుబట్టలు, పశువులు ముఖ్య మయిన దిగుమతులు. ఈజిల్లాయం దుత్తరమునకు తాడిపత్రియు, దక్షిణమునకు హిందూపురమును ప్రధానవర్తకస్థానములు. ఎగుమతి చేయుటకును, జిల్లాయందు దొరకుసరకు ప్రోగుచేయుటకును, దిగుమతి యయినసరకును స్థానికముగ పంచుటకును వారము వారము జరుగు సంతలు తోడ్పడును. ఈసంతలు లోకలుబోర్డువారియధీనమునం దుండును. ఇట్టివానిలో ముఖ్యమయినవి తాడిపత్రి, యాడికి, ఉరవ కొండ, పెనుకొండలందు జరగును.

## బాటలు

ఈజిల్లాయందు బండిబాటలు, రోడ్లు చాల కలవు. రోడ్లు వెనుకటికంటె చాల చక్కఁబడినవి. ౬,౪౮౧ చదరపుమైళ్ల వైశాల్యము కల యీజిల్లాయందు ౧,౦౪౦ మైళ్ల రోడ్లు కలదు. ఈజిల్లా యందలిరోడ్లను నాలుగుతరగతులుగ విభాగించిరి. ట్రంకురోడ్లు; రెండవతరగతిరోడ్లు; మూఁడవతరగతిరోడ్లు, జిల్లాబోర్డురోడ్లు కాక ఇతరములయినరోడ్లు. ట్రంకురోడ్డులు రెండు కలవు. అం దొకటి చెన్నపురినుండి బొంబాయికిని, రెండవది కర్నూలునుండి బెంగుళూరికిని పోవుచున్నది. ఈరెంటిని సరియైనస్థితియం దుంచుట కగు వ్యయము నంతయు గవర్నమెంటువారు భరింతురు. ఇవి మోటారు బండ్లు పోవుటకు తగినస్థితియం దున్నవి. రెండవతరగతిరోడ్లుకూడ ప్రయాణార్హమయినవే. వీనిని సరియైనస్థితియం దుంచుట కగు వ్యయమున సగము గవర్నమెంటువారును, సగము జిల్లాబోర్డువారును భరింతురు. మూఁడవతరగతిరోడ్లను జిల్లాబోర్డువారును, నాలుగవతర గతిరోడ్లను తాలూకాబోర్డువారును సుస్థితియం దుంచి కాపాడెదరు. వీనిని మరమ్మతుచేసి చక్కనిస్థితియం దుంచుటకు తగినంతధనము లేక పోవుటచేత ఈమూఁడు, నాలుగుతరగతులరోడ్లు అంత బాగుగ లేవు. కాని వీనిలో అనంతపురము — కల్యాణదుర్గమువంటి రోడ్లు కొన్ని ఇప్పుడు మోటారుబండ్లు పోవుటకుకూడ తగినస్థితియం దున్నవి.

# అనంతపురము జిల్లా


అనంతపురము జిల్లా
జిల్లాసరిహద్దు
తాలూకాసరిహద్దు
ఇనుపదారి
మోటారురవాదారికి అనుకూలమయిన రోడ్లు
మోటారురవాదారికి అననుకూలమైన రోడ్లు
నది, కాలువ, వంతెన
చెరువు
కొండలు
అనంతపురం
కల్యాణదుర్గం

# అనంతపురముజిల్లా

## రైలుమార్గములు

అనంతపురముజిల్లాపశ్చిమభాగమున ఒకచోటనుండి మఱియొక చోటికి పోవుటకు రోడ్లే యాధారము; కాని జిల్లాయుత్తర, మధ్యమ భాగములందు రైలుసౌకర్యముకూడ కలదు. ఈజిల్లాయందు మూఁడు రైలుమార్గములు కలవు. ఈరెండును జిల్లావాయవ్యదిశయం దున్న గుంతకల్లునొద్ద సంధించును. గుంతకల్లునుండి బళ్లారికిని, బొంబాయి రాజధానిదక్షిణభాగమునకును, నిజామురాష్ట్రమునకును, బొంబాయికిని, బెజవాడకును బోవునితరమార్గములు కలవు. ఈజిల్లాయుత్తరభాగముగుండ పోవురైలుమార్గము చెన్నపట్టణముననుండి 'వాడి'కిఁ బోవు చెన్నపురియినుపదారి. ఇది చెన్నపట్టణముననుండి వచ్చి ఈశాన్యపుదిక్కుగా నీజిల్లాలోఁ బ్రవేశించి తాడిపత్రి, గుత్తిగ్రామముల మీఁదుగ గుంతకల్లుజంక్షను చేరును. ఈజిల్లామధ్యభాగముననుండి పోవురైలుమార్గము దక్షిణమహారాష్ట్రపు ఇనుపదారిశాఖ. ఇది గుంతకల్లుననుండి దక్షిణముగ పామిడి, అనంతపురము, ధర్మవరము, పెనుకొండ, హిందూపురములమీఁదుగ మైసూరుసంస్థానమునందలి బెంగుళూరికి పోవును. ఈరైలుమార్గమును చెన్నపురి, దక్షిణమహారాష్ట్రపు–ఇనుపదారియొకశాఖ ఈజిల్లాయం దాగ్నేయదిశగఁ బ్రవేశించి తనకల్లు, కదిరిగ్రామములమీఁదుగ వచ్చి ధర్మవరమునొద్దఁ గలియును. ఈజిల్లాయందుఁ బోవు పైనుడివిన మూఁడురైలుమార్గములును చెన్నపురి, దక్షిణమహారాష్ట్రపురైల్వేకంపెనీవారివి.

## పరిపాలనము

ఈజిల్లాయందు మొదట నేడుతాలూకా లుండెడివి. ధర్మవరముతాలూకాను రెండువిభాగములు చేయుటవలనను, ౧౯౧౦ లో కడపజిల్లాయందలి కదిరితాలూకాను క్రొత్తగా నిందు చేర్చుటవలనను ఇప్పు డిందు తొమ్మిదితాలూకాలు కలవు. ఇవి నాలుగు సబ్‌డివిజనులుగా నేర్పఱుపఁబడినవి; ఎట్లన గుత్తి, తాడిపత్రితాలూకాలు గుత్తి సబ్‌డివిజను; అనంతపురము, కల్యాణదుర్గముతాలూకాలు అనంతపురముసబ్‌డివిజను; ధర్మవరము, కదిరితాలూకాలు ధర్మవరము సబ్‌డివిజను; పెనుకొండ, హిందూపురము, మడకశిరతాలూకాలు పెనుకొండసబ్‌డివిజను.

కలెక్టరు జిల్లాయధికారి. అనంతపురము ముఖ్యపట్టణము. ఈడివిజను 'ఇండియన్ సివిల్ సర్విసు' ఉద్యోగిది. పెనుకొండకు సబ్‌కలెక్టరు అధికారి. మిగిలిన డివిజనులకు డిప్యూటీకలెక్టరు లుందురు.

౧౯౨౦-వ సంవత్సరమువఱకు సివిలువ్యాజ్యములు పరిష్కరించుటకయి గుత్తిలోను, పెనుకొండలోను మునసబుకోర్టు లుండెడివి. ఈజిల్లాకు వేఱుగ జిల్లాకోర్టు ఉండెడిదికాదు. గుత్తిమునసబుకోర్టుమీఁద కర్నూలుజిల్లాకోర్టునకును, పెనుకొండమునసబుకోర్టుమీఁద బళ్లారి జిల్లాకోర్టునకును అప్పీళ్లు ఉండెడివి. 'సెషన్సుకేసులు' బళ్లారి 'సెషన్సుకోర్టు' ఎదుట విచారింపఁబడెడివి. ౧౯౨౦-వ సంవత్సరమున అనంతపురమునందు 'జిల్లాకోర్టు' ను, 'సెషన్స్‌కోర్టు' ను కూడ పెట్టినారు. ఈకారణమున ఇపుడు సివిలువ్యాజ్యముల విషయమునను, సెషన్స్‌కేసులవిషయమునను ఈజిల్లా యితరజిల్లాలమీఁద నాధారపడవలసినయావశ్యకము తప్పినది.

ఇతరజిల్లాలలోకంటె ఈజిల్లాలో వ్యాజ్యములు చాల తక్కువ. అనంతపురముసెషన్స్‌కోర్టులో జిల్లామొత్తముమీఁద వచ్చిన 'సెషన్స్‌కేసు' లన్నియు విచారణ యగును. ఈకేసులవిషయమున రాజధానిలెక్కలను పరిశీలించినయెడల రాయలసీమయందలి జిల్లాలన్నిటిలోకంటె నిచ్చట నివి యెక్కువ యని తేలుచున్నది. గ్రామమేజస్ట్రీటుకోర్టులు, గ్రామపంచాయతీకోర్టులు, అనంతపురము ధర్మవరము హిందూపురము తాడిపత్రి గుత్తి గుంతకల్లు కదిరి – బెంచి మేజస్ట్రీటుకోర్టులు, ఉరవకొండ, తనకల్లు, యాడికి డిప్యూటీతహసీలుదారు – మేజస్ట్రీటుకోర్టులు — వీనియందు క్రిమినలుకేసులు విచారణ యగుచుండును. 'డివిజనలు ఆఫీసరు'లకు, 'జిల్లామేజస్ట్రీటు'కు పూరా అధికారములు కలవు.

దొంగఒడ్డెలు, వాయల్పాడు లేక నవాబుపేటకొరచలు, దొంగదాసరులు, దొంగ - ఎఱుకలు, దొంగ - ఊరుకొరచలు, సుకాలీలు, మడకశిరతాలూకాయందలి దొమ్మరులు, పెద్దబోయలు—వీ రందఱు నేరములు చేయుజాతులవారికి వర్తించుచట్ట మనువర్తింపఁబడెను. ఈకారణమున, జిల్లాలెక్కలను జూచినచో నేరములు తగ్గినట్లు తెలియవచ్చుచున్నది. నేరములు చేయుజాతులవారిలో కొరచలు మిగుల నపాయకారులు. తరువాత వచ్చువారు సుకాలీలు. వీరిపిదప చెప్పవలసినవారు పెద్దబోయలు. ఈజిల్లాయందు విశేషముగ నున్నకక్షుల(పార్టీల)వలన ఇటీవలఁ గలిగిన చాలహత్యలకు వీరే బాధ్యులు. ఉరవకొండఫిర్కాలో వీ రెక్కువ. తాడిపత్రి, గుత్తితాలూకాలలో సామాన్యముగ హత్య లెక్కువ. పెనుకొండ గుత్తితాలూకాలయందు బందిపోటులు, దోపిడులు విశేషము.

పోలీసుజిల్లాసూపరింటెండెంటు అనంతపురమునం దుండును. గుత్తితాలూకాసహితమయిన గుత్తిసర్కిలు ప్రత్యేక మీతనిపెత్తనముక్రింద నుండును. ఇతనిక్రింది - ఇద్దఱు 'అసిస్టెంటు'లలో నొకఁడు పెనుకొండయం దుండి ధర్మవరముతాలూకాతోఁగూడ నీజిల్లాదక్షిణార్ధభాగమును, వేఱొకఁడు అనంతపురమునం దుండి గుత్తిమినహా ఉత్తరార్ధభాగమును కనిపెట్టుచుండును. స్థానికముగ నున్న పోలీసువారికి తోడు, బందిపోటుదొంగలు తఱచు వచ్చుచుండుకనుమలదగ్గఱ తలారుల నేర్పాటు చేసిరి. ఈనడుమ వీరిని చాలమందిని తగ్గించిరి. పోలీసుకార్యస్థానమును, పోలీసు 'మూలబలము' (Reserve) ను అనంతపురమునఁ గలవు. 'సెంట్రల్ పోలీసు రిక్రూయిట్‌స్కూలు' అనుపేర పోలీసుపనికి క్రొత్తగఁ జేరవచ్చువారిని తరిబీతు చేయుట కొకపాఠశాలను అనంతపురమున ౧౯౧౬-వ సంవత్సరమున నేర్పాటు చేసినారు. జిల్లాసూపరింటెండెంటునకు

తాబేదారుగ నుండి అసిస్టెంటు లేక డిప్యూటీసూపరింటెండెంటు దానిని నడపుచుండును. రాయలసీమజిల్లాలనుండియు, ఉత్తర సర్కారులనుండియు పోలీసుపనిలో క్రొత్తగ చేరఁదలఁచినవారిక్కడిపాఠశాలకు వత్తురు.

ఈ జిల్లాకు జిల్లాజైలు లేదు. జిల్లా మొత్తముమీఁద ౩౪ పోలీసుస్టేషనులును, ౧౧ 'ఔట్‌పోస్టు'లున్ను కలవు. జిల్లా సంరక్షణమునకయి తొమ్మండ్రు ఇన్‌స్పెక్టరులును, ౧౯ గురు సబ్ ఇన్‌స్పెక్టరులును, ఇరువురు సార్జెంటులును, ౪౯౬ గురు కానిస్టేబిలులును (హెడ్ కానిస్టేబిలులతోఁ గూడ), ౨౬ గురు తలారులును నియమింపఁబడినారు. ౧౨ సబ్ జైళ్లు కలవు. మాసమునకు పైని శిక్ష విధింపఁబడినవారిని బళ్లారిజైలునకు పంపెదరు. అన్ని సబ్ జైళ్లలోఁ గలసి ౨౩౬ గురు ఖైదీలు పట్టెదరు. పెనుకొండ, హిందూపురం, మడకశిర, ధర్మవరము, అనంతపురము, కల్యాణదుర్గముతాలూకాల కొక్కొక సబ్‌జైలును, కదిరి, గుత్తి, తాడిపత్రితాలూకాలకు రెండేసి సబ్‌జైళ్లును కలవు.

ఇదివఱకు రిజిస్ట్రేషన్‌విషయమున ఈజిల్లా బళ్లారిజిల్లాలోనిదిగనే యెంచఁబడుచుండెడిది. కాని ౧౯౧౯-వ సెప్టెంబరు మొదటి తేదీ నుండి ఈవిషయమున ఈజిల్లాను బళ్లారిజిల్లానుండి విడఁదీసి అనంతపురముజిల్లాకు జిల్లారిజిస్ట్రారును నియమించి, జిల్లారిజిస్ట్రారుకార్యస్థానముకూడ అనంతపురముననే ఏర్పాటు చేసిరి. జిల్లారిజిస్ట్రారు క్రింద జాయంటుసబురిజిస్ట్రారు ఉండును. వీరుకాక ఈజిల్లాయందు పదునొకండుగురు సబురిజిస్ట్రారులు కలరు. వీరిలో ఎనమండ్రు తాలూకాప్రధాననగరములం దుందురు. తక్కినవారిలో గుత్తి తాలూకాయందలి గుంతకల్లున నొకరును, ఉరవకొండయం దొకరును, పెనుకొండతాలూకాయందలి బుక్కపట్టణమున నొకరును ఉందురు. సాలీన రిజిస్టరగు స్థిరాస్తిమొత్తమువిలువ ౧౯౨౭ తో అంతమగు కడచిన యెనిమిదివత్సరములలో ౫౭ లక్షలనుండి ౫౬ లక్షలకు తగ్గినను, జిల్లారిజిస్ట్రారు ఏర్పడి యీమార్పులు జరగినప్పటినుండి రిజిస్ట్రేషను పని వృద్ధి యగుచున్నది.

అబ్కారిపరిపాలనమునిమిత్తము మొదట నెనిమిదితాలూకాలు కలిపి జిల్లానంతను ఒక్కసర్కిలుగా నేర్పాటు చేసిరి. ౧౯౧౪ - న చెట్లకు పన్ను కట్టుపద్ధతి వచ్చినతరువాతఁ అప్పుడు ఒక యిన్‌స్పెక్టరునకు పని యెక్కు వయినది. అందువలన పెనుకొండ సర్కిలు ఏర్పాటయినది. కదిరి, ధర్మవరము, పెనుకొండ, హిందూపురము, మడకశిర తాలూకాలు అయిదును పెనుకొండసర్కిలులో చేర్చిరి. మిగిలిన నాలుగు తాలూకాలును అనంతపురముసర్కిలులో చేర్పఁబడినవి.

## సహకారోద్యమము

సహకారోద్యమలాభమును బడసిన మొదటిజిల్లాలలో ఈయనంతపుర మొకటి. ఇది తఱచుగ తీవ్రమయిన కఱవుకాటకముల కెఱయగుటవలన వ్యవసాయమువలన జీవించుజనమున కీయుద్యమమువలన గొప్పప్రయోజనము కలిగినది. ఈజిల్లాయందు మొదటి సహకారపరపతిసంఘము ౧౯౦౫-వ సంవత్సరమున బుక్కపట్టణమున స్థాపితమయినది. ౧౯౨౭-వ సంవత్సరమున, అనఁగా నిరువదిమూఁడు సంవత్సరములకుఁ బిదప, ౫౧౨ సహకారపరపతిసంఘము లుండెను. ఈసంఘములలో నూటికి తొంబది కర్షకులకు ఋణము లిచ్చుసంఘములు (Agricultural Credit Societies). ఈ సంఘము లన్నిటఁ గలసి ౩౦,౦౦౦ ల సభ్యులు కలరు. నిర్వాహకమునకుఁ దిరుగుపెట్టుబడిమొత్తము (Working Capital) ౮౫ లక్షలు. ఈసంఘములు వ్యవసాయకుల కావశ్యకత కలిగినప్పుడు బదుళ్లు పుట్టుటలోఁగల కష్టములను దొలఁగించుటకే కాక ఋణప్రదాతలు విధించువడ్డీ ఎక్కువ 'వరవడి' ని (High rate) తగ్గించుటకును దోడ్పడినవి. జిల్లా 'సహకారపరపతిబ్యాంకి' ౧౯౧౯-వ సంవత్సరమున నేర్పడినది. ఇది ప్రజలవలననుండి నిలువచేయుటకు సొమ్ము (Deposits) తీసికొనును; చట్టముప్రకారము రిజిస్టరయినసంఘములకు సుకరమయిన పద్ధతుల మీఁద బదు ళ్లిచ్చును. ఈజిల్లాయందలి సహకారసంఘములలోఁ గొన్ని ప్రత్యేక మెక్కునిమ్నజాతులకే తోడ్పడునవియుఁ గలవు. అట్టివి ముప్పదిసంఘము లున్నవి. వీనిలో ౪౦౪ గురు సభ్యులున్నారు. నిర్వాహకమునకుఁ దిరుగుపెట్టుబడిమొత్తము రు. ౨౫,౦౦౦ లు. పట్టామీఁద భూములు సంపాదించి సేద్యముకొఱకు వానిని సంఘుసభ్యుల కొసఁగుట ఈముప్పదింటిలో అయిదుసంఘముల ప్రధానోద్దేశము. జిల్లాయందలి యీసంఘము లన్నిటిమీఁద నధికారి అనంతపురమునం దుండు అసిస్టెంటురిజిస్ట్రారు. ఈయసిస్టెంటు రిజిస్ట్రారుక్రింద, సంఘములపనిని తణిఖీ చేయుటకును, లెక్కలను సాలీన సరిచూచుటకును, మంచి చెడ్డలను తెలియఁజెప్పుటకును పదుముగ్గురు ఇన్‌స్పెక్టరులు కలరు.

## జనులు: మతము

ఈజిల్లాయందు ౧౮౯౧-వ సంవత్సరపుజనాభాలెక్క ననుసరించి ౭,౬౨,౬౮౦ మందియు, ౧౯౦౧-వ సంవత్సరపుజనాభాలెక్క ననుసరించి ౯,౩౩,౪౫౪ మందియు, ౧౯౧౧-వ సంవత్సరపు జనాభాలెక్క ననుసరించి ౯,౬౩,౨౨౮ గ్గురును, ౧౯౨౧-వ సంవత్సరపు జనాభాలెక్క ననుసరించి ౯,౫౫,౯౧౪ గురును జను లుండిరి. ఇటీవల ౧౯౩౧-వ సంవత్సరమున జరగినజనులగణితి ననుసరించి ఈజిల్లాయందలి మొత్తముజనసంఖ్య ౧౦,౫౦,౮౧౧ వఱకు పెరిగినది. ఇందు ౫,౩౯,౫౩౮ గురు పురుషులు; ౫,౧౦,౭౪౪ గురు స్త్రీలు. ౧౯౩౧-వ సంవత్సరపు జనాభాలెక్కల ననుసరించి 'తాలూకా వారిగ' విస్తీర్ణము, గ్రామములసంఖ్య, జనసంఖ్య మొదలైనవి ప్రక్కపుటలోని పట్టికయందుఁ జూపఁబడినవి.

| తాలూకాపేరు | విస్తీర్ణము చ. మైళ్లు | పట్టణముల సంఖ్య | గ్రామముల సంఖ్య | ఇండ్లసంఖ్య | జనాభా — ౧౯౩౧ | | | చ. మైలుకు జనసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | మొత్తము | పురుషులు | స్త్రీలు | ౧౯౩౧ |
| అనంతపురము డివిజన్ | | | | | | | | |
| అనంతపురము | ౯౨౬ | ౧ | ౧౧౪ | ౨౩,౬౬౮ | ౧,౧౬,౯౫౮ | ౬౧,౦౪౯ | ౫౫,౯౦౯ | ౧౨౬ |
| కల్యాణదుర్గము | ౮౨౧ | ౧ | ౭౪ | ౧౭,౫౯౦ | ౮౭,౪౪౭ | ౪౫,౨౩౬ | ౪౨,౨౧౧ | ౧౦[illegible] |
| ధర్మవరము డివిజన్ | | | | | | | | |
| ధర్మవరము | ౭౩౬ | ౧ | ౬౩ | ౧౮,౮౮౮ | ౯౦,౦౨౪ | ౪౬,౪౯౬ | ౪౩,౫౨౮ | ౧౨౨ |
| కదిరి | ౧,౧౬౨ | ౧ | ౧౪౧ | ౩౫,౮౬౭ | ౧,౭౩,౨౫౪ | ౮౯,౬౦౦ | ౮౩,౬౫౪ | ౧౪౯ |
| గుత్తి డివిజన్ | | | | | | | | |
| గుత్తి | ౮౯౬ | ౪ | ౩౨ | ౩౧,౫౬౯ | ౧,౫౯,౬౪౦ | ౮౧,౪౭౬ | ౭౮,౧౬౪ | ౧౭౮ |
| తాడిపత్రి | ౬౪౧ | ౧ | ౯౭ | ౨౩,౮౩౯ | ౧,౧౭,౩౧౫ | ౫౯,౩౭౩ | ౫౭,౯౪౨ | ౧౮౩ |
| పెనుకొండ డివిజన్ | | | | | | | | |
| హిందూపురము | ౪౩౧ | ౧ | ౭౭ | ౨౩,౫౦౭ | ౧,౧౦,౧౯౪ | ౫౬,౭౮౫ | ౫౩,౪౦౯ | ౨౫౬ |
| మడకశిర | ౪౪౬ | ౧ | ౫౭ | ౧౯,౧౬౦ | ౯౭,౦౮౧ | ౪౯,౨౭౩ | ౪౭,౮౦౮ | ౨౧౮ |
| పెనుకొండ | ౬౮౨ | ౧ | ౯౮ | ౨౧,౩౯౯ | ౯౮,౪౯౮ | ౫౦,౨౪౬ | ౪౮,౨౫౨ | ౧౪౪ |
| మొత్తము | ౬,౭౪౧ | ౧౨ | ౮౫౩ | ౨,౧౫,౪౮౭ | ౧౦,౫౦,౪౧౧ | ౫,౩౯,౫౩౪ | ౫,౧౦,౮౭౭ | ౧౫౬ |

ఈజిల్లాయందలిజనులలో నూటికి దాదాపు తొంబదిమంది హిందువులును, తొమ్మండ్రకుపైఁగా మహమ్మదీయులును గలరు. ముఖ్య మతముల ననుసరించి ఈ జిల్లాయందలి జనసంఖ్య యీ క్రింద 'తాలూకావారి'గా నీయఁబడినది.

| తాలూకా | హిందువులు | మహమ్మదీయులు | క్రైస్తవులు |
|---|---|---|---|
| అనంతపురము | ౧,౦౬,౬౪౮ | ౯,౫౮౭ | ౬౭౬ |
| ధర్మవరము | ౮౪,౮౯౫ | ౪,౭౬౨ | ౩౪౯ |
| గుత్తి | ౧,౩౬,౮౨౬ | ౨౦,౪౫౦ | ౨,౨౯౩ |
| హిందూపురము | ౯౮,౩౪౫ | ౧౧,౪౭౦ | ౩౦౯ |
| పెనుకొండ | ౮౯,౬౬౩ | ౮,౫౯౮ | ౨౨౭ |
| కదిరి | ౧,౫౦,౨౫౯ | ౨౨,౩౩౮ | ౬౫౫ |
| కల్యాణదుర్గము | ౮౩,౮౫౦ | ౩,౫౦౩ | ౮౩ |
| మడకశిర | ౯౨,౬౯౮ | ౩,౪౮౯ | ౪౬ |
| తాడిపత్రి | ౧,౦౦,౫౮౪ | ౧౪,౭౬౧ | ౧,౯౦౮ |
| మొత్తము | ౯,౪౩,౭౬౮ | ౯౮,౯౫౪ | ౬,౫౪౬ |

జైనులీజిల్లాయందు వేయిమందికిపైని కలరు. అందు ౮౪౮ గురు మడకశిరతాలూకాయం దున్నారు.

## వ్యవసాయము

జిల్లాయుత్తరభాగమునందుఁ దక్క మిగిలినభాగమునం దంతటను భూమి మిక్కిలి బీదది; ఫలవంతము కాదు. ఉత్తరపుతాలూకాల లోని రేగడిభూమియు నంత శ్రేష్ఠ మయినది కాదు. ఈజిల్లాలో పెద్ద ఆనకట్టలు కాని, ఏటికాల్వలు కాని లేవు. అందుచేత చెఱువుల యాధారమునను, బావులయాధారమునను మాగాణిపైరులు, తోఁట పైరులు చేయుదురు. ఈజిల్లాయం దిరువదవేలవఱకు బావులు కలవు. మిక్కిలి బెట్టకాలములో బావు లంతగ నుపయోగపడవు. మెరక పైరులలో కట్టజొన్న, రాగి ముఖ్యమయినవి. కొద్దిభూమి చేసి ఎక్కువపైరును, వెలగలపైరును పండించుటకు బదులుగా రైతులు ఎక్కువభూమిని దున్ని కొద్దిపైరులను బీదపైరులను పండించెదరు. ౧౩౪౦-వ ఫసలీ, అనఁగా ౧౯౩౦-౩౧-వ సంవత్సరమున 'రైతాధీన'మం దున్నభూమి ౧౮,౧౧,౭౦౯ యెకరములు. దీనివలన వచ్చు శిస్తుమొత్తము రు. ౧౩,౩౯,౦౩౩ లు. ఈ 'భూమి పరిమితము'న ౧౬,౯౦,౦౦౮ యెకరములనేల మెట్టవ్యవసాయము; ౧,౨౧,౭౦౧ యెకరములనేల పల్లపువ్యవసాయము (నీరుపాఱించి చేయునది). ఇప్పటికిని బీడుభూము లేఁటేఁటను సాగగుచున్నవి.

ఈమండలమున పచ్చికబయళ్లు మెండుగా లేకపోవుటచేత ఇచ్చట పుట్టు పశువు లంత శ్రేష్ఠ మయినవి కాకయున్నవి. అందువలన నెల్లూరిప్రాంతపు బలిష్ఠములయిన కోడెలను మంచివెలకుఁ గొని తీసికొనివచ్చుచుందురు. ఉన్నికొఱకీమండలమునందు గొఱ్ఱెలను మేఁకలను ఎక్కువగాఁ బెంచెదరు. ఈయున్నితో చాలగ్రామము లందు రత్నకంబళ్లు నేయుదురు.

## కఱవులు

ఈజిల్లాయందు వర్షపాతము చాల తక్కువ యగుటవలన పైరుపంటలకు తగినంత నీరు దొరకక తఱచుగ కఱవు సంభవించుచుండును; ఒక్కొక్కప్పు డతివృష్టి కలిగి పంటలు చెడి కఱవు సంభవించుటయు కలదు. కడచినశతాబ్దియందు ౧౮౦౩, ౧౮౨౪, ౧౮౩౩,

౧౮౩౩, ౧౮౫౪, ౧౮౬౬, ౧౮౭౬-౮, ౧౮౯౨, ౧౮౯౬ సంవత్సరములలో ఈజిల్లాయందు క్షామము సంభవించినది. గవర్నమెంటువా రిట్టికఱవుకాలమున నేవేవో పనులు తలపెట్టి క్షామబాధితులకు పనులు కల్పించి కొంతవఱకు క్షామబాధ నివారణ చేయుచున్నారు. ౧౯౨౧-౨, ౧౯౨౪ సంవత్సరములందు జిల్లాయంతటను గాకపోయిన కొన్ని తాలూకాలయం దయినను క్షామము సంభవించినది. ౧౯౨౧-౨-వ సంవత్సరపుకఱవు ముఖ్యముగ గుత్తికిఁ దగిలినది. ౧౯౨౪-వ సంవత్సరపుకఱవు జిల్లాయందు సగభాగమునకు పైఁగ తగిలిన దని చెప్పవచ్చును.

## భూమితరములు

విజయనగరాధీశులు పరిపాలించుచుండినకాలమున ఈజిల్లాయందలి వ్యవసాయపుభూములకు నెట్టితరము లుండెనో, భూములెట్లు అమరక మగుచుండెనో తెలిసికొనుట కాధారములు లేవు. అప్పుడు, పండినపంటలో రైతులు సంగోరుపాలు శిస్తుక్రింద చెల్లించుచుండిరని చెప్పుదురు. గోలకొండనవాబుల ప్రభుత్వమున 'కామీలు' పద్ధతి ననుసరించి భూమిశిస్తు వసూలు చేయుచుండిరి. ఈపద్ధతి ననుసరించికూడ సంగోరుపాలుధాన్యము ప్రభుత్వమువారికి పోవును. ఇది జమీందారుల, పాళెగాండ్రద్వారమున వసూ లగుచుండెను. మహారాష్ట్రులవశమున నుండినభాగమునందలిభూముల కేపద్ధతి ననుసరించి శిస్తు కట్టుచుండిరో తెలియదు. హైదరల్లీ శిస్తులు శాశ్వతముగ నిర్ణయము చేసెను; ఈనాములు మొదలయినవి జప్తు చేసి శిస్తు హెచ్చింపఁ బ్రయత్నించెను. కాని శిస్తులు క్రమముగ వసూలు చేసికొనఁగలిగినవాఁడు కాఁడు. ౧౭౯౨ లో నీప్రాంతము నైజామునకు వశపడినప్పుడు ౧౭౯౨-౯౩ సంవత్సరమున గొప్పకఱవు వచ్చి భూమివలని రాబడి తగ్గి శిస్తులును తగ్గిపోయినవి.

ఈ జిల్లా కంపెనీవారికి స్వాధీనపడినతరువాత భూములు అమరకము చేయుపద్ధతి మాఱినది. జమీందారులద్వారా శిస్తులు వసూలు చేయుటకు మాఱుగా, రైతులతో స్వయముగా దొరతనమువారు కౌళ్లు కుదుర్చుకొని, శిస్తు తామే వసూలు చేయఁజొచ్చిరి. ఈ అమరకపుపద్ధతిని 'రైతువారిపద్ధతి' యనియెదరు. ఇది మేజర్ మన్‌రో చేసిన యేర్పాటు. గ్రామమునసబుకరణములకు నిందువలనఁ బూర్వ మున్న లాభము తగ్గినందున వారివలన శిస్తువసూలుకుఁ గొంతభంగము మొదటఁ గలిగెను. కాని తరువాత వారును క్రమముగఁ బని చేయఁదొడఁగిరి. ౧౮౦౨-౧౮౦౬ సంవత్సరములలో భూములను కొల్పించి, భూములను 'దర్జావారి'గ విభజించి, మన్రో తరముల నిర్ణయించెను. తరువాత ఇండియాగవర్నమెంటువారు రైతువారిపద్ధతిని తీసివేసి, మొదట మూఁడేండ్లకు, తరువాత పదేండ్లకు గ్రామాదులు ఇజారాపద్ధతిమీఁద నిచ్చిరి. ఇందువలన లాభము కలిగినదికాదు. కావున ఇజారాపద్ధతి మానివేసి ౧౮౧౮ లో మరల రైతువారిపద్ధతిని ప్రారంభించిరి.

మన్రోచే నిర్ణయింపఁబడిన రేట్లు ఎక్కువ యనియు, వానిని తగ్గింపవలసిన దనియు ౧౮౨౦ లో దొరతనమువారిని కోరిరి. కాని ౧౮౨౧వఱకు ఆరేట్లు తగ్గింపఁబడినవికావు. అట్లు తగ్గింపఁబడిన రేట్లుకూడ ఎక్కువ యని ౧౮౫౯ లో వాని నింకను తగ్గించిరి. ఇట్లు రేట్లు తగ్గినతరువాత జిల్లా కొంచెము బాగుపడఁజొచ్చెను. కాని ౧౮౭౬-౮ సంవత్సరముల కఱవు వచ్చి జిల్లా నంతను మాడ్చి రైతులను బీదవారిని చేసెను. మరల ౧౮౭౮ లో సర్వే ప్రారంభమై ౧౮౯౭ లోఁ బూర్తి యైనపిదప అమరకము ౧౮౯౦ లో ప్రారంభమై ౧౮౯౭ లో ముగిసెను. కడపనుండి విడఁదీసి క్రొత్తగా ఈజిల్లాయందుఁ గలిపిన కదిరితాలూకాకుఁ ౧౩౨౩-వ ఫసలీ (౧౯౧౩ - ౧౪) లోను, గుత్తి, తాడిపత్రి తాలూకాలకు ౧౩౩౩-వ ఫసలీ (౧౯౨౩ - ౨౪) లోను, కల్యాణదుర్గము తాలూకాయందలి ౨౧ గ్రామములకు ౧౩౩౪-వ ఫసలీ (౧౯౨౪-౨౫) లోను, మిగిలినగ్రామములకును, అనంతపురము, ధర్మవరము, పెనుకొండ, హిందూపురము, మడకశిర తాలూకాలకును ౧౯౨౬ - ౨౮ సంవత్సరములలోను క్రొత్త అమరకము (Resettlement) జరగినది. ఈక్రొత్త అమరకము ననుసరించి కదిరితాలూకాపల్లపుభూమిరేటు ఎక్కువ రు. ౯ లు; తక్కువ రు. ౨ లు ; మెట్టభూమి ఎక్కువరేటు రు. ౨ లు, తక్కువ నాలుగణాలు; గుత్తి, తాడిపత్రి, కల్యాణదుర్గము ఇరువదియొక్క గ్రామములకు పల్లపుభూమి ఎక్కువరేటు రు. ౧౦-౨-౦ లు, తక్కువరేటు రు. ౧-౨-౦ లు ; మెరక ఎక్కువరేటు రు ౨-౮-౦ లు, తక్కువరేటు రెండణాలు; ౧౯౨౬—౨౮ న జరగిన అమరకము ననుసరించి జిల్లాయందు శేషించినభాగమున పల్లపుభూమి ఎక్కువరేటు రు. ౯-౯-౦ లు; తక్కువరేటు రు. ౧-౨-౦ లు. మెరక ఎక్కువరేటు రు. ౨ లు; తక్కువ రెండణాలు. ఈజిల్లాయందు జమీందారీలు లేవు. ఈనాంగ్రామములు ౧౦౮ కలవు. ఈజిల్లామొత్తముమీఁద వచ్చుభూమిశిస్తు ౧౩౪౦-వ ఫసలీకి రు. ౧౮,౦౫,౦౬౭ లు.

## స్థానిక స్వపరిపాలనము

ఈజిల్లాయందలి అనంతపురము, తాడిపత్రి, హిందూపురములు మునిసిపాలిటీలు. ఈజిల్లాకు జిల్లాబోర్డును, డివిజను కొక్కటిచొప్పున అనంతపురము, గుత్తి, ధర్మవరము, పెనుకొండలకు నాలుగింటికి నాలుగు తాలూకాబోర్డులును గలవు. పదుమూఁడు యూనియను లున్నవి. స్థానిక స్వపరిపాలనము వీనివశమున నున్నది.

## చరిత్ర

ఈజిల్లాలో మిక్కిలి పురాతనకాలమునాఁటి వని చెప్పఁదగు జాతితో చుట్టు నమర్పఁబడిన దిబ్బలు విశేషముగ కలవు. కల్యాణదుర్గము తాలూకాయందలి ముదిగల్లు, దేవతులబెట్ట, అనంతపురము తాలూకాయందలి మాల్యవంతము, హిందూపురము తాలూకాయందలి కొండాపురము, పూలేరు గ్రామములయొద్ద నిట్టివి పెక్కులు కలవు. గుహాలలోఁ గాఁపురముండెడు మిక్కిలి పురాతనకాలపువారిచేత [illegible] గుత్తితాలూకాయం దనేకములు కలవు. [illegible] మొదట లోయలుచేసి ప్రక్కభాగములను నునుపు

చేయవలయు నన్న యుద్దేశముతో గుంపులుగుంపులుగ జనము కూర్చుండి వాని నఱుగఁదీయుచుండి రని యూహించుటకుఁ దగిన నిదర్శనము లున్నవి. ఇ వన్నియుఁ జరిత్రకాలమునకుఁ బూర్వపు సంగతులు. అప్పటి జను లెవరో కనుఁగొనుటకు సాధనములు లేవు. వీరి యాయుధము లన్నియు శిలామయములు. వీరు శిలాయుగము వా రని చెప్పఁదగును.

ఈకాలమునకుఁ దరువాత చరిత్రకాలమువఱకు నీ ప్రదేశమును గుఱించిన చరిత్ర మేమియుఁ దెలియదు. క్రీస్తునకు పూర్వము మూఁడవశతాబ్ది నీప్రాంత మంతయు అశోకవర్ధనసామ్రాజ్యమునఁ జేరి యుండె ననుటకు గుత్తి కేడెనిమిదిమైళ్ల దూరమునఁ గల యెఱ్ఱగుడి గ్రామమున నిటీవలఁ గనుఁగొనఁబడిన అశోకుని 'శిలాలిపులే' తార్కాణము. అశోకునికాలమునాఁటినుండియు గుత్తి కీకారణమున ప్రాధాన్యము కల దని యూహింపనగును.

మౌర్యచక్రవర్తి యగు అశోకునియనంతర మాఱువందల సంవత్సరములవఱకు నీమండలచారిత్ర మజ్ఞాతయుగముగ నున్నది.

ఈకాలమున పశ్చిమగాంగులు, నలులు, బాదామిచాళుక్యులు, తెలుఁగుచోళులు ఈమండలము నంతను గాకున్న నందలి వేఱువేఱు ప్రాంతములను బరిపాలించిన ట్లూహింప నవకాశము కలదు. వీరిలో చాళుక్యులయొక్కయు, చోళులయొక్కయు శిలాశాసనములు గొన్ని యీ మండలమునఁ గానవచ్చినవి. ఈచాళుక్యులకు సామంతులుగ బాణవంశజులు ప్రాచీనకాలమున తురమరవిషయ మను పేరఁ బరఁగిన గుత్తి తాలూకాను పాలించిరి. హిందూపురముతాలూకా వీరి ప్రథమావాసస్థలముగ నుండియుండు ననుటకు తరువాతిబాణవంశజులు తమ శాసనములందు తాము 'పరివిపురాధీశ్వరుల' మని చెప్పుకొనుటయే తార్కాణము. పరివిపుర మనునది హిందూపురము తాలూకాయందలి యిప్పటి పరిగిగ్రామముగ గుర్తించియున్నారు. తరువాతికాలమున గుడిమల్లము, కాళహస్తి, చిత్తూరుప్రాంతములను బాలించిన బాణులకును, బాదామిచాళుక్యసామంతులయిన బాణులకును ఎట్టి సంబంధము కలదియు నింతవఱకుఁ దెలియరాదు.

బాదామిచాళుక్యరాజ్య మంతరించినపిదప మరల హిందూపుర ప్రాంతము పశ్చిమగాంగుల వశమయినది. వీరికి నొలంబులను పల్లవ వంశజులు మొదట సామంతులుగ నుండి పిదప స్వాతంత్ర్యమును సంపాదించి క్రీస్తుశక మెనిమిది, తొమ్మిది శతాబ్దులందు కల్యాణదుర్గము, మడకశిర, హిందూపుర ప్రాంతముల నేలిరి. నొలంబవాడి యనఁ బ్రసిద్ధమయిన నొలంబరాజ్యమునఁ గల ముఖ్యపట్టణములలో మడకశిరతాలూకాయందలి హేమావతి యొకటి. తరువాత మరల పశ్చిమగాంగులు విజృంభించి నొలంబులను జయించి తమ యధికారము నీ మండలముపయి వర్తింపఁజేసినను శీఘ్రకాలముననే వారు మాన్యఖేటపు రాష్ట్రకూటులకు సామంతు లయిరి.

పిదప రాష్ట్రకూటరాజ్యసౌధమును గూలఁద్రోసి చాళుక్యసామ్రాజ్యమును నిర్మించిన పశ్చిమచాళుక్యులకును, కాంచీపురపల్లవరాజ్యమును జయించి రాజ్యమును విస్తరింపఁజేసికొనుచుండిన చోళులకును పెక్కు సంగ్రామములు జరగి యీమండల మొకప్పుడు చోళులకును, మఱియొకప్పుడు పశ్చిమచాళుక్యులకును వశమగుచువచ్చినది. పశ్చిమచాళుక్యాధికార మీ మండలముపయి రమారమి క్రీస్తుశకము పదునొకండవశతాబ్ది కడవఱకు సాగిన దనవచ్చును.

ఈకాలమున ఉత్తరమున దేవగిరియాదవులును, దక్షిణమున, మొదట పశ్చిమచాళుక్యులకు సామంతులయి, వారి యధికారము క్షీణించుచుండినకాలమున ప్రాముఖ్యము వహించి స్వతంత్రు లయి రాజ్యమును పెంపొందించుకొనుచుండిన ద్వారసముద్రపు హొయిసలులును ప్రబలులయి యీ మండలము నొకప్పు డొకరును, మఱియొకప్పు డొకరు నధీనపఱుచుకొని పాలించిరి. క్రీస్తుశకము పదునాలుగవశతాబ్ది యారంభమున దక్కనుదేశముపయి మహమ్మదీయులు జరపిన దండయాత్రలవలన దేవగిరియాదవరాజ్యము మఱఁగిపోయినవెనుకఁగూడ, క్రీస్తుశకము ౧౩౪౦ వఱకు నీ మండలముదక్షిణభాగము, అనఁగా హిందూపురము మడకశిర ప్రాంతములు హొయిసలబల్లాళుల పరిపాలనముక్రిందనే యుండెను.

పదునాలుగవశతాబ్ది మధ్యమునుండి యీ మండలము విజయనగరసామ్రాజ్యమున నంతర్భాగ మయ్యెను. పెనుకొండ, గుత్తిదుర్గములు విజయనగరాధీశులకాలమున శత్రుదుస్సాధము లన్న ఖ్యాతిఁబడసినవి. క్రీ. శ. ౧౫౬౫ న జరగిన 'రక్కసతగడి' యుద్ధమున విజయనగరచక్రవర్తియయిన సదాశివరాయల ప్రతినిధి అళియరామరాయలు వధింపఁబడి, విజయనగరసైన్యములు పరాజయము నొందిన పిదప అళియరామరాయల సోదరుఁ డయిన తిరుమలరాయలు విజయనగరమును విడిచిపెట్టి సదాశివరాయలను వెంటనిడికొని పెనుకొండ కరిగి దానిని రాజధానిఁ గావించెను. ఇచ్చట నెన్నియోమాఱులు విజయనగరాధిపతులు పెనుకొండపయి నెత్తివచ్చిన తురుష్కుల నోడించిరి. బలహీనులయిన విజయనగరమురాజులు తరువాతఁ గొంతకాలమునకుఁ దమరాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికి మార్చిరి. గుత్తియుఁ గాలక్రమమున తురుష్కుల యధీన మయ్యెను. వారియొద్దనుండి మురారిరావను మహారాష్ట్రవీరుఁడు గుత్తిని వశపఱుచుకొనెను. ఈ కాలమునందు దేశమంతయు నరాజకమై, యొక్కరాజులేక, యెవరి కెంతభాగము చిక్కిన వా రంతభాగమునకు నధిపతు లగుచు, పెక్కు పాళెగాండ్రు దేశము నేలుచుండిరి. ఏలుచుండి రనుటకంటె దోఁచుకొనుచుండి రనుట మేలు. ఇట్టివారిలో అనంతపురము హండేవారు ప్రముఖులుగ నుండిరి. ఈ పాళెగాండ్రు వీ లయినప్పుడు స్వతంత్రులయి వీలు కానప్పుడు పైవారికి లోఁబడి మెలఁగుచుండిరి. హైదరల్లీ ప్రబలుఁ డైనపుడు ఈ భాగమును సులభముగ స్వాధీనపఱుచుకొనెను. ఒక్క గుత్తిదుర్గము మాత్రము చాలకాలము వశముకాలేదు. అది చివరకు కోటలోఁ ద్రాగుటకు నీరు లేనందున ౧౭౭౫లో వశమయ్యెను.

మహారాష్ట్రులు, నైజాము, ఇంగ్లీషువారు కలసి ౧౭౯౨ లో టిప్పూ సుల్తాను నోడించినపుడు, ఇప్పటి అనంతపురముజిల్లా యొక్క ఈశాన్యభాగమైన యప్పటి తాడిపత్రి, తాడిమఱ్ఱి తాలూకాలు నైజామున కీయఁబడెను. టిప్పూ చనిపోయిన తరువాత ౧౭౯౯ లో అతని రాజ్యమును ఇంగ్లీషు, నైజాము మొదలగువారు పంచుకొనునపుడు ఈజిల్లాయొక్క మిగిలినభాగ మంతయు నైజామునకుఁ బోయెను. ఈ రెండు తహనామాల (treaties) ననుసరించి నైజామునకు వచ్చిన రాజ్య మంతయు, నతఁడు ౧౮౦౦ లో నింగ్లీషువారికి దత్తము చేసెను. అవియే దత్తమండలములు (Ceded Districts). దత్తమండలప్రదేశమున కిప్పుడు రాయలసీమ యని పేరు. నైజాముసంరక్షణ నిమిత్తమై యింగ్లీషువా రుంచవలసిన సైన్యముకర్చుక్రింద ఈమండలములు శాశ్వతముగ నింగ్లీషువారి కీయఁబడెను. అప్పు డనంతపురముగూడ బ్రిటిషుప్రభుత్వమునఁ జేరెను.

మొదట దత్తమండలముల కన్నిటికి నొక్కఁడె కలెక్టరుండెను. మొదటికలెక్టరు మేజర్ మన్రో (ఇతఁడే తరువాత సర్ పదవిని బొందెను). తరువాత దత్తమండలములు రెండుజిల్లాలుగ విభజింపఁబడెను. అందు బళ్లారిజిల్లాలో నిప్పటి యనంతపుర ముండెను. బళ్లారిజిల్లా పెద్దది అయినందున ౧౮౮౨లో దానిని రెండు జిల్లాలుగ విభజించి, ఒకదానికి బళ్లారి అనియు, రెండవదానికి అనంతపుర మనియు పేర్లు పెట్టిరి. కదిరితాలూకా యిటీవల - కడపజిల్లాలోనిది - ఇందుఁ జేర్పఁబడినది.

ఈజిల్లాలో చరిత్రప్రసిద్ధములయిన పురాతనదుర్గములు గుత్తి, పెనుకొండ కోటలు. తాడిపత్రిలో పెన్నయొడ్డున నున్న దేవాలయము, లేపాక్షి, హేమావతిదేవాలయములు రమణీయశిల్పశోభితములు.

నిడుగల్లుకూడ చరిత్రప్రసిద్ధమయిన స్థలము. ఈ నిడుగల్లు రాజ్యమును పదునొకండు, పండ్రెండు, పదుమూఁడు శతాబ్దులందు చోళవంశజులు పాలించిరి. వారి రాజధాని యిప్పటి హేమావతిగ గుర్తింపఁబడిన పెంజేఱు: హెంజే ఱనియు దీనికి నామాంతరము కలదు. వీ రీమండలమును వశపఱుచుకొన్న ప్రధానరాజవంశముల కొకప్పుడు సామంతులుగను, వారి యధికారము క్షీణించుచుండినకాలమున స్వతంత్రులుగను రాజ్య మేలుచువచ్చిరి. పదునేడవశతాబ్దియం దీరాజ్యము విజయనగరపు ఆరవీటివారికి సామంతులుగ హరతినాయకులు పాలించిరి. టిప్పుసుల్తా నీప్రాంతమును జయించి తనరాజ్యమునఁ గలుపుకొనువఱకు వీ రధికారము నెఱపుచునే యుండిరి.

క్రీస్తుశక మేడవశతాబ్దినాఁటి తెలుఁగుశాసనములు కొన్ని యీ మండలమునందలి, గుత్తితాలూకాయందుఁ గానవచ్చినవి. తెలుఁగుభాష నున్న మొదటిశాసనములలో నివి కొన్ని. వీనిలో మొట్టమొదటఁ జెప్పఁదగినది బాదామి చాళుక్యప్రభువయిన మొదటి విక్రమాదిత్యుని ఇరువదియేడవ పరిపాలనవర్షము (క్రీ. శ. ౬౮౨) నాఁటిది.

**అనంతపురము తాలూకా** — అనంతపురముజిల్లాయందలి యొక తాలూకా. ఉత్తరమున గుత్తితాలూకాకును, తూర్పున తాడిపత్రితాలూకాకును, దక్షిణమున ధర్మవరముతాలూకాకును, పడుమట కల్యాణదుర్గముతాలూకాకును నడుమ నున్నది. దీని విస్తీర్ణము ౯౨౬ చ. మైళ్లు. జనసంఖ్య ౧,౧౬,౯౫౮ (౧౯౩౧). ఈ తాలూకాయందు ౧౧౪ గ్రామములు కలవు. అనంతపుర మొక్కటే ఈతాలూకాయందలి పట్టణము. ఇందలి మెట్ట, పల్లము కలసి ౧౩౩౫-వ ఫసలీ (౧౯౨౫-౧౯౨౬) లో ౨,౦౦,౦౬౫ యెకరములు: మొత్తము శిస్తు రు ౧,౧౫,౭౪౮ లు.

ఈ తాలూకా మిట్టపల్లములు గల ప్రదేశము. భూమి బీదదయినందున ఫలవంతము కాదు. అందుచేత పచ్చని చెట్లు తక్కువగఁ గానవచ్చును. ఉత్తరమున నచ్చటచ్చట నల్లరేగడభూమి కొద్దిగఁ గలదు. ఈ తాలూకా కుత్తరమున పెన్నయు, తూర్పున చిత్రావతియుఁ గలవు. కాని వీనివలన తాలూకా కేమియు ప్రయోజనము లేదు. పల్లపువ్యవసాయమున కంతకును వర్షమే ప్రధానాధారము.

మొదట విజయనగరాధీశులక్రిందఁ బాళెగాండ్రుగ నుండిన హండేవంశజులు ఈప్రాంతమునఁ బ్రసిద్ధు లయిన నాయకులు. విజయనగరరాజులప్రభ తగ్గినపిదప హండే మలకప్పనాయఁడు గోలకొండ నవాబునకు సామంతుఁడయి అనంతపురమునకుఁ జుట్టుపట్టులనుండు ప్రాంతమును జాగీరుగ సంపాదించెను. ౧౮౦౦ లలో నింగ్లీషువారికి వశపడువఱకు అనంతపురమును ముఖ్యపట్టణముగ చేసికొని యీ వంశమువారే యెవరికో యొకరికి లోఁబడి ఈ ప్రాంతము నేలుచుండిరి. ఈకారణమున అనంతపురముతాలూకాకు ముఖ్యపట్టణ మయిన అనంతపురమునకు 'హండే అనంతపుర' మని ప్రసిద్ధి కలిగినది (చూడుఁడు: హండేవంశము).

అనంతపురసమీపమున నున్న చెఱువును క్రీ. శ. ౧౩౬౪-న విజయనగరరాజుల మంత్రియయిన చిక్కప్పఒడయ రనునతఁడు కట్టించెను.

**అనంతఫందీ** — ఒకమహారాష్ట్రకవి. ఇతఁడు శా. శ. ౧౬౬౬ లో జన్మించి ౧౭౪౧ లోఁ గీర్తిశేషుఁ డయ్యెను. నగరప్రాంతమునందలి సంగమనేర్ గ్రామనివాసి. మొదట నితఁడు శృంగారాతిరేకముగల 'లావిణీ' లనఁబడు వృత్తములలోఁ బద్యములఁ జెప్పుచు మగపిల్లలను వెంటఁ దీసికొని వారి నాడించుచు జీవనము చేయుచుండెను. కాని యొకసారి అహల్యాబాయి సంగమనేరునకు వెళ్లినప్పు డామె యీతనిని బిలిపించి బ్రాహ్మణున కిది తగ దని చెప్పఁగా నామార్గము విడిచి యితఁడు భక్తిపరమైన కవిత్వముఁ జెప్పుచు హరికథలు చెప్పఁదొడఁగెను. ఇతనిచే రచింపఁబడినచాటువులు పెక్కులు గలవు. కావ్యములలోమాత్రము మాధవగ్రంథ మనునది యొక్కటున్నది. ఇందు రెండవమాధవరావుపేష్వా మేడమీఁదనుండి దూఁకినప్పటనుండి రెండవబాజీరావు రాజ్యాభిషేకము

జరగువఱకును వర్ణింపఁబడినది. కవికి జరగిన యథార్థస్థితి, ఉత్తరములు వ్రాసి, తెలిపి రెండవబాజీరావు ఈచరిత్ర వ్రాయించెను. ఇతనికి శ్రీపత్ ఫందీ యను నామాంతరముగల సవాయిఫందీ యను కుమారుఁ డుండెను. అతఁడును కవియే.

**అనంతభట్లఖండ్రిక** — నెల్లూరిజిల్లా కోవూరు తాలూకాయందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౫ (౧౯౩౧).

**అనంతభట్టు** — ఇతఁడు శివాజీగురు వైన రామదాసస్వామికి సమకాలికుఁడు. సాధుపురుషుఁడు. రామదాసస్వామియొక్క పంచాయతనములో నొక్కఁడు.

**అనంతభూపాలుఁడు** తుపాకుల — ౧. ఇతనితండ్రి కృష్ణభూపాలుఁడు; తల్లి భాగమాంబ. 'వచనరచనా వైచక్షణ్యుఁ' డితఁడు. భగవద్గీతలు, విష్ణుపురాణము, రామాయణము, భారతము వచనమున వ్రాసినాఁడు. రామాయణమున సుందరకాండ మొక్కటి మాత్రమే (౫ ఆశ్వాసములు) లభించినది. భారతమున సభా, భీష్మపర్వములుమాత్రము లభించినవి.

మట్ల — ౨. విజయనగర సామ్రాజ్యపువైభవము తఱిగినపిదప పదునాఱవశతాబ్దియంతమున నామమాత్ర లయినరాయలయొక్క భూములయందు సర్వస్వతంత్రముగనో, కొంత స్వతంత్రముగనో అచ్చటచ్చట రాజ్యభారము నిర్వహించినవానిలో నీమట్లవంశ మొక్కటియై కన్పించుచున్నది. మట్ల కడపజిల్లా రాయచోటితాలూకాలో నున్నది. మట్లప్రభువులు విజయనగరాధీశులకు సామంతు లయిన స్వల్పసంస్థానాధిపతులు. మట్లవారిలో నొక్కఁడగు వరదరాజు శ్రీ కృష్ణదేవరాయలయల్లుఁడు. మట్లవంశమువా రాంధ్రచోడులుగఁ గన్పట్టుచున్నారు. వీరు సూర్యవంశజులు. వీరి మూలపురుషుఁడు తిమ్మప్రభుఁడు. చాటుపద్యములను బట్టియు, కకుత్స్థవిజయ-అభిషిక్తరాఘవములనుబట్టియు మూఁడ మట్లవంశోద్భవులు విద్యాప్రియులును, రణప్రియులు నయి కన్పట్టుచున్నారు. అందు అనంతభూపాలుఁడు పెనుకొండకడ మల్కబలముల సాధించినట్లును, గుత్తిముకొండను స్వాధీనపఱుచుకొనినట్లును, సిద్ధవటదుర్గము నాక్రమించుకొనినట్లును, రాయలచే 'సురమాయి' బిరుద మందినట్లును తెలియవచ్చుచున్నది. యుద్ధవీరుఁడుగను, కావ్యకర్తగను బ్రఖ్యాతిఁ గాంచిన ఈ యనంతభూపాలుఁడు ఎల్లభరారమణునకును, రంగమాంబకును బుత్త్రుఁడు; తిరుమలతోళప్పాచార్యుల శిష్యుఁడు. పదునాఱవశతాబ్ది యుత్తరార్ధమునను, పదునేడవశతాబ్ది యాదిని నుండినవాఁడు. ఇతఁడు కకుత్స్థవిజయ మను గ్రంథమును రచించెను.

**అనంతమడుగు** — నెల్లూరుజిల్లా రాపూరుతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౬౮౫ (౧౯౩౧).

**అనంతయ** — 'విష్ణుమాయానాటకప్రబంధము' అను ఐదాశ్వాసముల గ్రంథమును రచించినకవి. భారద్వాజసగోత్రుఁడు, అయ్యలామాత్యుఁ డితనితండ్రి.

**అనంతయజ్వ, రేపూరి** — ఇతఁ డొక తెలుఁగు కవి. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. వైదికబ్రాహ్మణుఁడు. బాలకవి బిరుదాంకితుఁడు. మహాపండితుఁ డగు బాలకవి అనంతార్యునకు పౌత్త్రుఁడు. కాళహస్తికవి యితని తండ్రి. అనంతయజ్వ ౧౭-వ శతాబ్ది తుదిభాగపువాఁ డని తెలియుచున్నది. తిరుచనాపల్లికి సమీపమున నున్న 'తురైయూరు' ఇతని నివాసస్థాన మని కొందఱ యూహ. ఇతఁడు రచించిన గ్రంథములు రెండు. శ్రీముష్ణమాహాత్మ్యము, శివరహస్యఖండము. ఇందు మొదటిదానిలో నైదాశ్వాసములును, రెండవదానిలో ౭ ఆశ్వాసములును గలవు. శ్రీముష్ణమాహాత్మ్యము వెంగళమ కృష్ణభూపాలునకును, రెండవది తీర్థపుర (తురైయూరు) నందీశ్వరునకును అంకితమొనర్పఁబడినవి. కవిత్వము ప్రౌఢము, మనోహరము.

**అనంతయ్యగారిపల్లి** — కడపజిల్లా రాజంపేట తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౨,౦౬౯ (౧౯౩౧).

**అనంతరాజపురం** — ౧. చిత్తూరుజిల్లా తిరుత్తని తాలూకాయందలి జమీన్దారీగ్రామము. జనసంఖ్య ౩౦౦ (౧౯౩౧).

౨. కడపజిల్లా బద్వేలు తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౮౫౫ (౧౯౩౧).

**అనంతరాజుపేట** — కడపజిల్లా రాజంపేటతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪,౩౨౬ (౧౯౩౧).

**అనంతరామకవి** — ఒక సంస్కృతకవి. 'స్వానుభూతి' యను పేర నొక నాటకము రచించెను.

**అనంతవరం** — ౧. గుంటూరుజిల్లా తెనాలి తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౨,౬౯౩ (౧౯౩౧).

౨. గుంటూరుజిల్లా బాపట్లతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౪౬౨ (౧౯౩౧).

౩. నెల్లూరిజిల్లాకోవూరుతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౪౭౬ (౧౯౩౧).

౪. గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౨,౮౮౦ (౧౯౩౧).

౫. గుంటూరుజిల్లా ఒంగోలు తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౧౭౧ (౧౯౩౧).

౬. గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౯౦౮ (౧౯౩౧)

౭. నెల్లూరుజిల్లా దర్శితాలూకా యందలి జమీాన్దారీ గ్రామము. జనసంఖ్య ౨౬౯ (౧౯౩౧).

౪. విశాఖపట్టణముజిల్లా భీమునిపట్టణముతాలూకాయందలి జమీాన్దారీగ్రామము. జనసంఖ్య ౧,౯౫౦ (౧౯౩౧).

**అనంతవరప్పాడు** — గుంటూరుజిల్లా గుంటూరు తాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౨,౨౪౬ (౧౯౩౧).

**అనంతవర్మ** — ఇది కళింగము నేలిన గాంగవంశనృపాలుర పెక్కుమందికిఁ గలనామము. తమశాసనములందు గాంగేయశకవత్సరముల నొసంగిన పూర్వగాంగభూపతులలోఁ బెక్కుమంది కనంతవర్మనామము కలదు. గాంగశకము ౨౦౪-వ వత్సరమున క్రోష్టుకవర్తని యందలి తాలథెరెగ్రామమును బ్రాహ్మణులకు దాన మొసంగినవాఁడు దేవేంద్రవర్మకుమారుఁ డనంతవర్మ. రాజేంద్రవర్మకుమారుఁ డనంతవర్మ గాంగశకము ౩౦౪-వ సంవత్సరమునాఁటివాఁ డొకఁడు కలఁడు. ఇట్లే పూర్వ గాంగనృపాలురశాసనములవలన అనంతవర్మనామధారుల కుమారులును పెక్కురు తెలియవచ్చెదరు. గాంగశకము ౫౧ నాఁటి దేవేంద్రవర్మ, గాంగశకము ౨౨౧ నాఁటినందవర్మ, గాంగశకము ౨౫౪ నాఁటి దేవేంద్రవర్మ, గాంగశకము ౩౪౨ నాఁటి రాజేంద్రవర్మ, గాంగశకము ౫౨౦ నాఁటి దేవేంద్రవర్మ, గాంగశకము ౫౨౬ నాఁటి మధుకామార్ణవుఁడు — శాసనములందు వీ రందఱు తాము అనంతవర్మ తనయుల మని చెప్పుకొన్నవారే. పూర్వగాంగవంశజుల వంశావతారక్రమము కాని, అనుస్యూతచారిత్రము కాని, గాంగశకారంభవత్సరము కాని ఇంకను అజ్ఞాతవిషయములుగ నున్నందున ఈయనంతవర్మనామధేయుల పరస్పరసంబంధమును, చరిత్రమును ఇంకను నిగూఢముగనే యున్నవి.

పూర్వగాంగులను విడిచి ‘పరగాంగులు’ (Later Gangas), అనఁగా మొదటిరాజరాజుతండ్రి యైన వజ్రహస్తదేవునినాఁటినుండి కళింగమును పాలించినవారిశాసనములను బరిశీలించినచో అనంతవర్మ యనునది యారాజుల ద్వితీయనామముగఁ గన్పట్టును. రాజరాజు తండ్రి యయిన వజ్రహస్తదేవుఁడు శాసనములయం దనంతవర్మ వజ్రహస్తదేవుఁ డని పేర్కొనఁబడినాఁడు. ఇట్లే ఈతని పౌత్రుఁడును, మొదటి రాజరాజుకుమారుఁడునగు చోడగంగదేవునికి అనంతవర్మచోడగంగదేవుఁ డని శాసనప్రసిద్ధి. చోడగంగదేవుని కుమారుఁడయిన కామార్ణవదేవునిదగ్గఱనుండి మూఁడవ నరసింహదేవునివఱకుఁ గల కళింగ గాంగధరణీధవు లెల్లరును అనంతవర్మనామాంచితులే. వీరిలోఁ గొందఱు తమశాసనములందు కేవల మొక్క యనంతవర్మనామముననే పేర్కొనఁబడిరి.

**అనంతవిజయము** — ధర్మరాజుని శంఖము.

**అనంతవ్రతము** — ఒకవ్రతము. భాద్రపదశుద్ధచతుర్దశినాఁడు వచ్చును. అనంతపద్మనాభుఁ డనుపేర విష్ణువు ఉపాసింపఁబడును.

**అనంతశయనగుడి** — బళ్లారిజిల్లా, హొస్పేటతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪౩౮ (౧౯౩౧).

**అనంతశయనము** — ఇది తిరువాన్కూరు సంస్థానమునకు ముఖ్యపట్టణము. దీనినే తిరు-అనంతపుర (తిరువనంతపుర) మనియెదరు. ప్రస్తుతవ్యవహారనామము ‘త్రివేండ్రము’. ఈపట్టణపు వైశాల్యము రమారమి పదిచతురపుమైళ్లు.

జనసంఖ్య ౯౬,౦౧౬ (౧౯౩౧). వీరిలో పురుషులు ౪౯,౩౯౨; స్త్రీలు ౪౬,౬౨౪. జనసంఖ్యయంతలో చదువనేర్చినవారు ౩౭,౨౯౬ గురు. వీరిలో ౨౫,౦౬౯ గురు పురుషులు; ౧౨,౨౨౭ గురు స్త్రీలు. ఇంగ్లీషువచ్చినవారిపురమున ౧౨,౩౬౯ గురు కలరు. వీరిలో ౨,౭౬౯ గురు స్త్రీలు; మిగిలినవారు పురుషులు.

ఇచ్చట మహారాజులుంగారును, బ్రిటిషురెసిడెంటును ఉందురు. పట్టణము సముద్రమునొద్దనుండి రెండుమైళ్లదూరమున నుండును. ఇందు భవ్యమైన యొకదుర్గము గలదు. దానిచుట్టు నుండుప్రాకారము వేయిగజముల పొడువును (తూర్పు, పడమరలు), ఎనిమిదివందల గజముల వెడల్పును (ఉత్తర, దక్షిణములు) ఉండును. పట్టణము కోటకు లోపల వెలుపల నున్నను కోటలోని భాగమే ముఖ్యమైనది. అందు రాజభవనము, రాణుల మందిరములు, అనంతపద్మనాభునివిఖ్యాతదేవాలయమును గలవు.

అనంతపద్మనాభునిదేవాలయమువలననే ఈపట్టణమునకు విశేషఖ్యాతి కలిగినది. హిందువులచే నిది యొకమహత్తరక్షేత్రముగా పరిగణింపఁబడుచున్నది. భరతఖండమునందలి యన్నిదేశములనుండియు యాత్రికు లెల్లపుడును గుంపులుగుంపులుగా వచ్చుచుందురు. ఇచ్చట శ్రీమహావిష్ణువు ‘అనంతుఁ’ డనునాగముపై పవ్వళించియుండును. ఈ క్షేత్రము మిక్కిలి పురాతన మని చెప్పెదరు. దీని యుత్పత్తిని గుఱించి పెక్కుగాథలు కలవు. అందీక్రిందిది యొకటి:—

‘విల్వమంగళమ్ స్వామియార్’ అను నొకస్వామి మలబారుదేశమందు పెక్కుదేవాలయములను కట్టించెనఁట. అతఁడు కనులు మూసికొని ధ్యానము చేయునపు డొక చిన్నబాలుఁడు వచ్చి, అతని సాలగ్రామమును తీసివేసి, పూలసెజ్జల్లి ఇతరపూజాద్రవ్యములను చెల్లాచెదరు చేసి, పెక్కువిధముల నతనిని చిక్కుపఱుచుచుండెను. అతఁడు కనులు తెఱచినతోడనే మాయాశిశు వదృశ్యుఁ డగుచుండెను. ఒకదినమున నాస్వామి మిక్కిలి కోపము వచ్చి కన్నులు మూసికొనియుండియే తనచేతితో నాపిల్లవానిని త్రోసివేసెను. అంత నాతఁ డదృశ్యుఁడై ‘నీ వెవ్వని త్రోసివేసితివో వాఁడు నీ యిష్టదేవత. ఇఁక నీ కతఁడు ‘అనంతన్కాడ్’ అనుస్థలమునందుమాత్రము

కానవచ్చును' అని చెప్పెను. అంత స్వామి కన్నులు తెఱచి, తానా పిల్లవాని నిజస్వరూపమును దెలిసికొనఁజాలనందులకు చింతిల్లెను. అతఁడు 'అనంతన్ కడ్' స్థలము నెన్నఁడును వినియుండలేదు. అతఁడాస్థలమును గనుఁగొనుటకై పోఁగాఁ బోఁగా నొక్కచోట నేడ్చుచున్న తనకుమారుని భయపెట్టుటకై "నీవి ట్లేడ్చినయెడల నిన్ను 'అనంతన్ కడ్' లో వేసెదను" అనుమాట వినవచ్చెను. అంత నాతఁడు ప్రాణము లేచివచ్చినట్లయి, ఆస్త్రీని బ్రార్థించి, ఆ స్థలమును తెలిసికొని అచ్చటికి వెళ్లఁగా ఆదిశేషునిపైఁ బవ్వళించియున్న విష్ణుమూర్తి అతనికిఁ గానుపించెను. ఆమూర్తి 'తిరువల్లం' మొదలు 'తిరుప్పపూర్' వఱకు వ్యాపించి యుండెను. తిరు-అనంతపురములో దానినడిమిభాగ ముండెను. ఇంతపెద్దమూర్తికి పూజ చేయుట గాని, గుడి కట్టుట గాని భక్తులకు సాధ్యము గానందున 'చిన్నవాఁడవు' గమ్మని యా స్వామి ప్రార్థించెను. అంత నా మూర్తి చిన్నవాఁడయ్యెను. ఆదేశపురాజు దానికి గుడి కట్టించెను.



అనంతపద్మనాభస్వామి దేవాలయము, పద్మతీర్థము

ప్రస్తుత మున్న దేవాలయము మిక్కిలి పురాతనమైనది కాదు! దేవాలయములోని కొన్నిచక్కనిభాగములును, ఎదుటనుండు గోపురములును మార్తాండవర్మ (క్రీ. శ. ౧౭౨౯ — ౧౭౫౮) అను రాజుకాలమునఁ గట్టఁబడినవి.

ఈదేవాలయమునకు భూములమీఁద సంవత్సరమునకు రు. ౭౫,౦౦౦ లు రాబడి వచ్చును. ఈదేవాలయముయొక్క వ్యవహారములను జూచుటకై 'ఎట్టరయోగము' అనుసంఘము గలదు. ఎట్టరయోగ మనఁగా ఎనిమిదిన్నరమందికూడిక. ఎనమండ్రు బ్రాహ్మణులును, మహారాజుగారును గలసి ఈసంఘ మగును. మహారాజుగారికి సగము 'ఓటు' మాత్రమే కలదు. దేవాలయమునకు సంబంధించి 'అగ్రశాల' అనునొక గొప్పసత్రము గలదు. అందు బ్రాహ్మణుల కెడతెగకుండ సంతర్పణములు జరగుచుండును. ఈదేవున కుత్సవములు విశేషముగా జరగుచుండును.



మ్యూజియము, పౌరోద్యానవనము

కోటకు త్తరమున నొకమైలుదూరమున రాజమార్గము ప్రక్కను 'హుజూరు కచ్చేరి' యనఁబడుమందిరములు గలవు. అందు దివాన్ కచ్చేరియు, హైకోర్టును, మిగతకచ్చేరీలును గలవు. అవి మిక్కిలి చక్కనికట్టడములు. వీని కుత్తరమున బాలికాబాలకులకై విడివిడిగా నిర్మింపఁబడిన ఉన్నతపాఠశాలలును, 'విక్టోరియా జూబిలీహాలు', 'ఇండస్ట్రియల్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్', సార్వజనికపుస్తకభాండాగారమును, 'సైన్యనివేశము'ను (Military Cantonment) గలవు. ఇంక నుత్తరమునకుఁ బోయిన 'నేపియరుమ్యూజియము' (చిత్రవస్తుప్రదర్శనాలయము) కలదు. అది పౌరోద్యానమునందు నెలకొల్పఁబడినది. మలయాళవాస్తుశాస్త్రసిద్ధాంతముల ననుసరించి మనోహరముగ కట్టఁబడినది. దీనికి సమీపమునందే నక్షత్రశాల (Observatory) గలదు. అది సముద్రపుమట్టమునకుపైన నూటతొంబది-అడుగుల యెత్తున నున్నది. దక్షిణదిక్కునందుఁ దప్ప తక్కినదిశలయం దెల్లను నేఁబదిమొదలు రెండువందలఅడుగులయెత్తుగలగుట్టలమీఁద నుండుగృహములును, ఎల్లకాలమును నవనవలాడుచు పచ్చిగను, సుందరముగను నుండు పొలములును ప్రకృతిశోభను వెదచల్లుచుండును.



పౌరభవనములు

అనంతశయనము వర్తకమునకు ప్రఖ్యాతి చెందినది కాదు. అది చిన్న రేవుస్థలము. అచ్చటికి వచ్చెడిపడవలు స్వల్పము. అవియైనను తీరసమీపమునకు రాఁజాలవు. సముద్రమున దూరముగా నిల్వవలయును.

**అనంతసముద్రం** — కడపజిల్లా రాజంపేటతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౩౬౮ (౧౯౩౧).

**అనంతసముద్రం చిన్నమాంబాపురం** — కడపజిల్లా రాజంపేటతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౨౦౦ (౧౯౩౧).

**అనంతసాగరము** — ౧. నెల్లూరుజిల్లా ఆత్మకూరుతాలూకాయందలి యొకగ్రామము. ఇక్కడఁగల ఒకమసీదును, గొప్ప తటాకమును దర్శనీయములు. ఈ చెఱువునకు అనంతసాగర మని పేరు. దీనింబట్టియే గ్రామనామము. దీనిపై నుండుశిలాశాసనమునుబట్టి దీనిని శ్రీకృష్ణదేవమహారాయలకాలమున క్రీ. శ. ౧౫౨౨ లో 'రాయసం కొండమరసు' అనువతఁడు తనతలిదండ్రులయిన తిమ్మరసు, సాయయమ్మల జ్ఞాపకార్థ మీ చెఱువును త్రవ్వించినట్లు తెలియుచున్నది. జనసంఖ్య ౩,౨౪౮ (౧౯౩౧).

౨. నెల్లూరుజిల్లా కందుకూరుతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౩౭౨ (౧౯౩౧).

**అనంతసుత (విట్ఠల్)** — ౧. ఈకవి సుమారు డెబ్బదినాలుగు సంవత్సరములకు పూర్వ ముండినవాఁడు. ఈతని పూర్వుఁడు (? తండ్రి) హంగానదియొడ్డునఁ గల పింపళగ్రామమున నుండెడివాఁడు. ఆకారణమున నీతనికి పింపళగ్రామమునకైరా మూఁడు గ్రామములకు పౌరోహిత్యము, కరిణీకముకూడఁ గలవు. ఈతనితల్లి పేరు రాధాబాయి. ఈమెమరణానంతర మనంతుఁడు సన్న్యసించెను. ఈతని 'దత్తప్రబోధ' యనుగ్రంథ మొక్కటియే సుప్రసిద్ధముగ నున్నది. ఇందలి ముప్పదియేడధ్యాయములు శివ, నారద, పద్మపురాణముల నాధారముగాఁ గొని దత్తాత్రేయునికథను వర్ణించును. మిగిలిన యిరువదినాలుగధ్యాయములందును దత్తాత్రేయసంప్రదాయము విపులముగను, మనోహరముగను వర్ణింపఁబడినది.

౨. సంతకవికావ్యసూచీకారుఁ డొకయనంతవిట్ఠలుని సూచించినాఁడు ఆతఁడు (౧) వస్త్రహరణము (౨) గజగౌరీవ్రతము (౩) సుధన్వాఖ్యానము (?) (౪) తాటకావధ (౫) గరుడహనుమాన్ భేటీ అనుగ్రంథములను రచియించెను.

**అనంతాచార్యుఁడు** — ౧. ప్రసిద్ధుఁడగు భాష్యకారుఁడు. లక్ష్మీధరుని కుమారుఁడు. వేదార్థదీపిక యను పేరను యజుర్వేదభాష్యమును, వేదార్థచంద్ర మను పేరను మీమాంసా గ్రంథమును రచించెను.

౨. సువిఖ్యాతుఁ డగు నొక దార్శనికుఁడు. సంస్కృతభాషలో నితఁడు రచించిన యీ క్రింది గ్రంథములు దొరకినవి. అభిన్ననిమిత్తవాద, ఆకాశాధికరణవాద, ఓంకారవాద, జ్ఞానార్థవాద, శరీరవాద, శాస్త్రీయమతసమర్థన, సమాసవాదాదులు చిన్నచిన్న గ్రంథములు; న్యాయభాస్కరము, విధిసుధాకరము, సిద్ధాంతసిద్ధాంజనములు వేదాంత గ్రంథములు.

౩. వైదికనిఘంటువుటీక, జటాపటలము, శతకోటి ఖండనము, స్వరూపసంబంధరూపము అను న్యాయగ్రంథములు వ్రాసినవాఁడు.

**అనంతానందగిర్యాచార్యుఁడు** — ఇతఁడు శంకరవిజయ మను సంస్కృత గ్రంథమును రచించిన కవి. ఇందు శ్రీ శంకరాచార్యుఁ డవతరించుట మొదలుగా బ్రహ్మైక్యముఁ జెందుట వఱకుఁ గల యాతని చరిత్ర ౮౨ చిన్నచిన్న ప్రకరణములుగ రచింపఁబడినది. నడుమనడుమ సందర్భానుసారముగాఁ గొన్ని శ్లోకములును కలవు. కాని గ్రంథము మొత్తముమీఁద గద్యాత్మకము.

**అనంతానందుఁడు** — వైష్ణవమతమును స్థాపించిన రామానందుని పండ్రెండుగురు శిష్యులలో నొకఁడు.

**అనంతాపురము** — ౧. చిత్తూరుజిల్లా చిత్తూరుతాలూకాయందలి జమీన్‌దారీగ్రామము. జనసంఖ్య ౪౦౨ (౧౯౩౧).

౨. చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౧౫౩ (౧౯౩౧). రాచెఱు వని దీనికి నామాంతరము.

౩. నెల్లూరుజిల్లా కావలితాలూకాయందలి జమీన్‌దారీగ్రామము. జనసంఖ్య ౮౦౭ (౧౯౩౧).

**అనంతామాత్యుఁడు** — అనంతచ్ఛందస్సని తెలుఁగునఁ బేరుగన్న ఛందోగ్రంథమునకుఁ గర్త. ఈగ్రంథముగాక యీతఁడు భోజరాజీయ మనుకావ్యమును, రసార్ణవ మనఁబడు సాహిత్యశాస్త్రమును రచించెను.

ఈ కవి తనవంశమును భోజరాజీయమునందు సవిస్తరముగ వర్ణించినాఁడు.

ఈకవి యార్వేలసంతతివాఁడు. ఈతనిముత్తాతయగు బయ్యన్న తిక్కనసోమయాజితో సామకాలికుఁడు. సోమయాజి యీతనిని మెచ్చి 'భవ్యభారతి' యన్న బిరు దిచ్చెను. వైష్ణవులు వీరికి గురువులుగ నుండిరి. ఈ కవికి గోవిందచక్రవర్తి గురువు. కవితల్లియైన మల్లమాంబిక గొప్పవారియింటి యాఁడుఁబడుచువలెఁ గానవచ్చెడిని. ఆమెతండ్రి యొకదండనాయకుఁ డని కవియే వ్రాసినాఁడు. కవితండ్రి తిక్కన భూవసతియు, నుద్యోగమును గలిగి సుఖజీవనము

చేయుచుండెను. వీరిది కౌండిన్యసగోత్రము. వీ రార్గురన్నదమ్ములైనం దునఁ గవి చమత్కారముగ నీక్రిందిపద్యమున నిట్లు చెప్పెను:—

క. ఈయార్వుర నొక్కొక్కఁడు
వేయిండ్లకు మొదలు గాఁగ వెలయుదు రని కా
దే యారువేల పే రిడి
రీయన్వయమునకు సేవ్య మెఱిఁగినపెద్దల్. [౧. ౮౫.]

ఆఱువేలనియోగులను గుఱించిన యుల్లేఖము గల వాక్య మిదియే ఆంధ్రవాఙ్మయమునందు మొదటిది. తెలుఁగు బ్రాహ్మణులలో ఆఱువేల శాఖ రమారమి తిక్కనకాలమునాఁటికే యేర్పడియుండె నని యిందు వలనఁ దెలియుచున్నది. పై సంగతులన్నియు భోజరాజీయమందలి అవతారిక ననుసరించి వ్రాయఁబడినవి.

ఇఁక నీతనినివాసస్థాన మెద్ది యని మనము విచారింపవలసి యున్నది. ఇందునుగుఱించి భోజరాజీయమందలి యీక్రిందిపద్యము మన కాధారము:—

సీ. విలసితంబగు కృష్ణవేణ మలాపహా
రిణి భీమరథి నా ధరిత్రియందుఁ
దనరు నదీత్రయాంతర్వేది యగుపావ
నక్షేత్రమున శోభనముల కెల్ల
ధర నివాసం బగు పెరుమగూరిపురంబు
నందు విద్వజ్జనానంద మైన
జీవనస్థితిచేతఁ జెన్నొందు వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వ మొంది
నెమ్మి ప్రత్యక్షపరమపద మ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁ డైన
యంధ్రవల్లభహరిసేవ[1] నలరుచుండుఁ
బెక్కుభంగుల మమ్మడి తిక్కవిభుఁడు!

ఈ పద్యమునుబట్టి చూడ నీకవియొక్కతండ్రి కృష్ణవేణ, భీమరథి, మలాపహ యనఁబడునదులు కలసినయంతర్వేదిలో నుండె నని-అట్టిస్థల మాతని స్వస్థాన మని-తెలియుచున్నది. అట్టిస్థల మెద్ది? కృష్ణవేణ యనఁగ కృష్ణ, భీమరథి యనఁగ భీమ, మలాపహ యనఁగ మలప్రభ అనునదు లనుట స్పష్టము. కృష్ణానదియు, మలప్రభా నదియు నైజామురాజ్యమునకుఁ బశ్చిమపుసరిహద్దునొద్ద బొంబాయి రాజధానిలోఁ గలసినవి. ఇది యిప్పుడు కన్నడదేశము. కృష్ణయు భీమయు నైజామురాష్ట్రమునందు రాయచూరుపట్టణమునకుఁ బశ్చిమమునఁ బదాఱుమైళ్ల మీఁదఁ గలసినవి. ఇది తెలుఁగుదేశ మని చెప్ప వచ్చును. కావున నీకవినివాసస్థలము నైజామురాజ్యమునం దుండె నని మన మూహింపవచ్చును. శ్రీకాకుళపు-ఆంధ్ర విష్ణువు (దేవుఁడు) వీరికిఁ గులదైవము కావచ్చును.

ఈకవి 'రసార్ణవము'నందుఁ దనకాల మిట్లు వ్రాసికొన్నాఁడు:

శా. జా నొందన్ శకవర్షముల్ ఋతుశరజ్వాలేందులై యొప్పు న
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీ భౌమ యో
గ్యానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీ నిండన్ ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్.

శా. శ. ౧౩౫౬ ఆనందనామసంవత్సర మాఘ బహుళ ౧౧ మంగళవార మనఁగా క్రీ. శ. ౧౪౩౫ జనవరి ౨౫-వ తేదీ యగును. కావున నీకవి పదునైదవశతాబ్దిమధ్యమునం దున్నవాఁ డని నిశ్చయింపవచ్చును.

ఈ కవిచే రచింపఁబడిన మూఁడుగ్రంథములును దేవాంకితములు గనుక నింతకంటె విశేషము లేవియు మన మీకవినిగుఱించి తెలిసికొనుటకు వీలు లేదు. ఇఁక నేతద్రచితగ్రంథమునుగుఱించి విచారింతము.

భోజరాజీయము రచించినతరువాత ఛందస్సు రచించినట్లు ఛందస్సుయొక్క నాల్గవయాశ్వాసమునందుఁ గవి భోజరాజీయమును పేర్కొనుటవలనఁ దెలియుచున్నది. భోజరాజీయ మేడాశ్వాసములు గల మంచి ప్రబంధము. అహోబిలనృసింహస్వామి కంకితము. ఇందు భోజరాజునుగుఱించిన వింతయైన కథలు పెక్కు కలవు. ఈకావ్యమును ౧౯౦౮-లో శ్రీ వీరేశలింగముగారు ముద్రించినారు. వారు దాని పీఠికలో నీప్రబంధమునుగుఱించి యిట్లు వ్రాసినారు:—

'ఈతనికవిత్వము సలక్షణ మయి యనర్గళధార గలదియై మనోహరముగ నుండును. కవిత్వముమాత్రమే కాక భోజరాజీయము నందలి కథలును మిక్కిలి యింపుగా నుండును. కవిత్రయమువారి ప్రయోగములకంటె భిన్నము లైనప్రయోగము లీభోజరాజీయము నందుఁ గొన్ని కానవచ్చుచున్నను మొత్తముమీఁద నిందలికవిత్వము నిర్దుష్ట మయి శ్లాఘ్యముగ నున్నది.'

ఈ కవికిఁ దిక్కనసోమయాజిని అనుకరింపవలె నన్నయభిలాష మెండుగ నున్నట్టు కావ్యమువలనఁ గానవచ్చుచున్నది. ఒక్క యుదాహరణ మిచ్చెదము. నిర్వచనోత్తరరామాయణమునందుఁ దిక్కన తాను కావ్యము వ్రాయుట కిట్లు కారణము వ్రాసెను.

1. 'ఆంధ్రవల్లభహరిసేవ నలరుచుండు' ననఁగా నీతఁ డాంధ్రరాయనియొద్ద నుద్యోగిగా నుండెనని కొంద ఱర్థముచేసికొనిరి. కాని యది పొరపాటు. 'ఆంధ్రవల్లభహరి' యనఁగా నాంధ్రవిష్ణువు; శ్రీకాకుళములోనిదేవుఁడు. అతనిసేవచేయుట యనఁగా నతనిని భక్తితో భజించుట. ఏగ్రామమునం దేదేవుఁ డుండునో ఆదేవుని తద్గ్రామాధిపతిగాఁ జెప్పుట భక్తులయాచారముగా నున్నది. ఇట్లే యీకవియొక్క 'రసార్ణవ'మందలి 'శ్రీనిండన్ ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్' అన్నచరణముఁ జూచి కొంద ఱీగ్రంథమును ధ్రువపట్టణపురాజున కిచ్చె నని భ్రమపడుచున్నారు. అచ్చటను ధ్రువపట్టణాధిపుఁ డనఁగా ధ్రువపట్టణపుదేవుఁ డని యర్థము. ఈకవి తనగ్రంథ మేదియు నరాంకితము చేయలేదు.

సీ. సకలలోకప్రదీపకుఁ డగు పద్మినీ
మిత్రవంశమున జన్మించె ననియుఁ
జూచిన మగలైనఁ జొక్కుడునట్టి సౌం
దర్యసంపద సొంపు దాల్చె ననియు
జనహృదయానంద జనక మై నెగడిన
చతురతకల్మి నప్రతిమఁ డనియు
మెఱసి యొండొంటికి మిగులుశౌర్యత్యాగ
విఖ్యాతకీర్తుల వెలసె ననియు
తే. వివిధవిద్యాపరిశ్రమవేది యనియు
సరసబహుమానవిరచనాశాలి యనియు
మత్కృతీశ్వరుఁ డగుచున్న మనుమనృపతి
సుభగుఁ గావించుటకు సముత్సుకుఁడ నైతి.

ఈ పైపద్యమును జూచి యీయనంతకవి తాను కావ్యము వ్రాయుటకుఁ గారణములు చెప్పఁదలఁచి యిట్లు వ్రాసెను:—

సీ. నూతనం బయ్యుఁ బురాతనకృతులట్ల
సంతతశ్రావ్యమై జరగు ననియు
నాదిరాజసమానుఁ డగు భోజనరపతి
చరిత మీ కవితాప్రసంగ మనియు
నిందుఁ జెప్పెడికథ లన్నియు నోలిఁ బ్ర
శస్త ధర్మోపదేశంబు లనియు
నఖిలజగన్నాథుఁ డగు నహోబిలనాథుఁ
డీపుణ్యకృతికి నధీశుఁ డనియుఁ
గీ. బృథివి నెల్లజనులు ప్రియభక్తియుక్తిఁ బా
టింతు రనియు నూఱడిల్లి యేను
బరమసౌఖ్య మైన భవదాభిముఖ్యంబు
నెమ్మిఁ బడసి యధికనిష్ఠతోడ. [౧. ౭౮]

రసార్ణవ మనునది నాలుగాశ్వాసముల యలంకారగ్రంథము. మొదటియాశ్వాసమునందు నవరసస్థాయిభావాదులును, రెండవ యాశ్వాసమునందు రతిగుణవిభావానుభావాదులును, మూఁడవ యాశ్వాసమునందు శృంగారరసప్రకరణమును, నాల్గవయాశ్వాసమునందు నాయికానాయక ప్రకరణమును వర్ణింపఁబడినవి. మాకు దొరకినప్రతిలోఁ గృత్యాది పద్యములు లేవు. ఈకృతియు విష్ణుమూర్తి కర్పింపఁబడినది.

అనంతుఁడు గొప్పలాక్షణికుఁడు. అనంతునిఛందస్సు తెలుఁగుబాసయందు బహుకాలమునుండియుఁ బేరుగన్నగ్రంథము. లక్షణవేత్త లందఱును దానిని గౌరవముగఁ బేర్కొని, యం దుండి యెన్నియో లక్ష్యములను లక్షణములను ఉదాహరించియున్నారు. కాని యిప్పు డీగ్రంథము సంపూర్ణముగ దొరకుట లేదు. దీనిని పూర్తిగ సంపాదించి యచ్చొత్తించినవారు లేరు. రెండాశ్వాసముల గ్రంథము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునం దున్నది. రెండవ, మూఁడవ, నాల్గవ ఆశ్వాసముల యసంపూర్తిప్రతి యొక్కటి మ-రా-శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారివలన మాకు దొరకినది.

భీమనకృత మనఁబడు కవిజనాశ్రయమును విడిచినయెడల, తెలుఁగున నిదియే మిక్కిలి పురాతనచ్ఛందోగ్రంథ మని చెప్పవలెను.

ఇందలి ప్రథమాశ్వాసములో 'గద్యపద్యాదికావ్యలక్షణంబును, గురులఘు నిర్ణయంబును, గణనిరూపణంబును, ప్రాసయతివిశేషంబులును, పరిగణసంజ్ఞయుం' గలవు. రెండవదానిలో 'సభియ భాషా నిరూపణంబును, గద్యవచనంబులవిధంబును, షడ్వింశతిచ్ఛందోనామంబులును, తదుద్భవంబులగు సమవృత్తంబులును, వృత్తవిశ్రమంబు లగు నర్ధసమవృత్తంబులును, ఛందఃప్రోక్తంబగు మాలావృత్తంబులును, దదుద్భవంబు లగు దండకంబులును' నిరూపింపఁబడినవి. మూఁడవదానిలో 'జాతిలక్షణలక్షితంబులును, జాటుకావ్యపరిమాణంబులును, ఉదాహరణంబులును, షట్ప్రత్యయంబులును, సప్తమప్రత్యయం బైన సమవృత్తంబుల వెరసుల నెఱుఁగు తెఱఁగును' కలవు. నాల్గవదానిలో 'వర్జ్యంబు లగు దశదోషంబుల నేర్పఱుచుటయును, నందు దోషరహితంబులై యాదరణీయంబు లగుపట్లఁ జేర్చుటయును, సంధిసమాసంబులును' కలవు. ఇట్లీ గ్రంథమునందుఁ గొంత వ్యాకరణవిషయముకూడఁ గలదు.

ఈ గ్రంథమునకు మేము చూచినప్రతులలో 'ఛందోవర్ణ' మన్న పేరున్నది. అది లేఖకప్రమాదమేమో, 'ఛందోఽర్ణవ' మన్నది నిజమైన నామమేమో యని సంశయము కలుగుచున్నది.

**అనంతాయి** — గంజాంజిల్లా బరహంపురంతాలూకా యందలి గ్రామము. ఇచటి జనసంఖ్య ౧,౦౭౮. (౧౯౩౧).

**అనంతారం** — తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురం తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౨౦ (౧౯౩౧).

**అనంతి** — శతరూపకు నామాంతరము.

**అనంతుఁడు** — ౧. కామధేను వను జ్యోతిషగ్రంథముపై టీక వ్రాసినవాఁడు. 'జాతక పద్ధతి' యను నొక గ్రంథ మితనిది గలదు. ఇతఁడు గార్గ్యసగోత్రుఁడు. గోదావరీతీరమున నున్న ధర్మపురి యితని వాసస్థలముఁ. కావున, ఆంధ్రుఁడు. తండ్రి పేరు చింతామణి. కుమారులు శ్రీకంఠుఁడు, రాముఁడు. వీరును జ్యోతిషశాస్త్రమునఁ బేరొందినవారు, గ్రంథకర్తలు.

౨. అంతములేనివాఁడు, పరమాత్మ.

౩. కశ్యప కద్రూసంతతియైన నాగులలో నొక్కఁడు.

౪. శేషునకు ఈపేరు గలదు.

౫. జైనుల ఇరువది నలుగురు తీర్థంకరులలో పదునాల్గవవాఁడు.

**అనందతాలూకా** — ఈ తాలూకా బొంబాయి రాజధానిలోని కైరాజిల్లా మధ్యఁ గలదు. వైశాల్యము ౨౮౮ చతురపుమైళ్లు. జనసంఖ్య ౧,౮౩,౩౦౫. రాబడి ఐదులక్షలు. జలవసతి తక్కువ.

**అనందపట్టణము** — ఇది అనందతాలూకాకు ముఖ్య పట్టణము. జనసంఖ్య ౧౦,౦౧౦. ఇక్కడ క్రైస్తవ మత సంఘములు కలవు.

**అనందపాలుఁడు** — లాహోరు రాజ్యపు రాజు. గజినీ మహమ్మూదుతో హోరాహోరిగఁ బోరాడిన వీరాగ్రేసరుఁడు. ఇతఁడు బ్రాహ్మణవంశజుఁ డని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు కాని 'పాల్' అను ఉపపదమువలన ఇతఁడు రాజపుత్త్రుఁ డని తోఁచుచున్నది. ఇతనితండ్రిపేరు జయపాలుఁడు. జయపాలుఁడు మహమ్మూదుతోఁ బోరి యోడిపోయి క్రీ. శ. ౧౦౦౨ లో నగ్నిఁ బ్రవేశించెను. అంత అనందపాలుఁడు రాజ్యమునకు వచ్చెను. మహమ్మూదు ౧౦౦౫ లో ముల్తానుమీఁదికి దాడి వెడలినప్పుడు, అనందపాలుఁడాతని సైన్యమును తనరాజ్యములోనుండి పోనియ్యక అడ్డగించినందున పెషావరుగుట్టలలో వారికి ఘోరమైన పోరు జరగి అనందపాలుఁ డోడి కాశ్మీరమునకు పాఱిపోయెను. ౧౦౦౮-వ సంవత్సరమునందు మహమ్మూద్ అయిదవసారి హిందూదేశముమీఁదికి దండువెడలి వచ్చెను. ముల్తానుదండయాత్రాసమయమున అనందపాలుఁడు తన్ను మిక్కిలి యగౌరవపఱిచినందున వానిని శిక్షించుటకై మహమ్మూదు నిశ్చయించెను. ఈసమాచారము తెలిసికొని తురకల నీదేశమునుండి వెడలఁగొట్టుటకు గట్టిప్రయత్నముచేయ నిశ్చయించి, అనందపాలుఁడు హిందూరాజుల కందఱకు మతాభిమానముగలవా రందఱు యుద్ధమునకు వచ్చునట్లు చేయుటకై తనమాతల నంపెను. ఉజ్జయిని, గ్వాలియర్, కళింజర్, కన్నోజ, ఢిల్లీ, అజమీరు రాజ్యాధిపతులు తమతమ సైన్యములతో వచ్చి అనందపాలునిఁ గలసికొనిరి. హిందువుల సైన్యము మిక్కిలి గొప్పదిగ నుండెను. అనందపాలుఁడే వీని కంతకు సైన్యాధిపతి యయ్యెను. హిందూసైనికులు, 'గక్కరీ' లనఁబడు అసమానశౌర్యముగల క్షత్త్రియులు దినదినము వచ్చి హిందూసైన్యమునఁ జేరుచుండిరి. స్వమతధ్వంసకు లగు తురుష్కుల నెదిరించుటకై హిందూస్త్రీలు దూరదేశములనుండి యసంఖ్యధనమును బంపి యెంతో సాహాయ్యము చేసిరి. బీదస్త్రీలుఁగూడ, దూదిని ఏకియు మఱి యన్యవిధమైన కూలిని జేసియు గడించి సొమ్మును బంపుచుండిరి.

ఈతడవ హిందువులు మిక్కిలి పట్టుదలతో నున్నా రని తెలిసికొని మహమ్మూదు తన శిబిరముచుట్టును కందకములఁద్రవ్వించి, హిందువు లకస్మాత్తుగఁ దనమీఁదఁ బడకుండ నేర్పాటు చేసి, ఆఱువేలధనుర్ధరులను కందకమునొద్దకు రప్పించి హిందువులపై బాణములఁ గురిపించి యుద్ధము ప్రారంభించెను. కందకములను లక్ష్యము చేయక ముప్పదివేల గక్కరీహిందూవీరులు రెండువైపులనుండి మహమ్మూదు సైన్యములోఁ బ్రవేశించి, తమ బల్లెములతోను, ఇతరాయుధములతోను, శత్త్రువులయశ్వసైన్యమును చెండాడిరి. కొన్ని నిముసములలో మూఁడునాలుగువేల తురుష్కసైనికులను వారిగుఱ్ఱములతో యమపురి కంపిరి. వారిశౌర్యోద్రేకమును జూచి భయపడి, మహమ్మూగు నాఁటికి యుద్ధమును జాలింపఁదలంచెను. కాని ఇంతలో అనందపాలుఁ డెక్కినయేనుఁగు బెదరి తిరిగి పాఱిపోఁజొచ్చెను. అది తమపరాభవముగాఁ దలంచి హిందూసైనికు లందఱును చెల్లాచెదరై పాఱిపోయిరి. మహమ్మదీయు లంత వారివెంటఁ దగిలి ౮,౦౦౦ వేలమందిని జంపిరి. అనందపాలుఁడు ౧౦౧౨ లో మృతుఁడైనట్లు కానవచ్చుచున్నది. పైని వ్రాసిన వర్ణన మంతయు ఫెరిస్తా యనుతురుష్కచరిత్రకారుని గ్రంథము ననుసరించి వ్రాయఁబడినది. దీనినిబట్టి చూడ నెల్లప్పుడొక్క మహమ్మూదు గెలిచినట్లును, అనందపాలుఁ డోడినట్లును గానవచ్చుచున్నది. కాని యి ట్లనుకొనుటకు వీలు లేదు. ఎందు కన, మహమ్మూదుయొక్క ఆస్థానపండితుఁ డైన 'అబూర్ హాన్ అల్ బిరూనీ' అనువాఁడు 'తారీఖ్-ఈ-హింద్' అనుచరిత్రగ్రంథమునం దనందపాలునివంశచరిత్ర వ్రాయుచు ని ట్లనియున్నాఁడు:—

'ఈ రాజులు మిక్కిలి రాజ్యము గలవా రయ్యును, ఉత్తమ గుణభూషితులుగను, ఆడి తప్పనివారుగను, తమకంటెఁ దక్కువ వారియెడ ననుగ్రహము గలవారుగను నుండిరి. అమీర్ మహమ్మూదునకు విరోధకాలమునం దనందపాలుఁడు వ్రాసిన యీ యుత్తర మెంతయుఁ గొనియాడఁదగియున్నది:

'నీ రాజ్యముమీఁదికి తురకలు (Turks) దండెత్తి వచ్చిరనియు, ఖురాసాన్ ప్రదేశమం దంతటను నిండి రనియు విన్నాఁడను. వలయునెడ ౫౦౦ ల గుఱ్ఱములతోను, ౧,౧౦౦ సైనికులతోను, ౧౦౦ ఏనుఁగులతోను నీకు సాయము చేయుటకు వచ్చెదను. లేదా నీకిష్టమున్నయెడల పైనిఁ జెప్పఁబడ్డదానికంటె రెట్టింపుసైన్యముల నిచ్చి నాకుమారుని బంపెదను. నీ యనుగ్రహమునకై నే నిట్లు వ్రాయలేదు. నేను నిన్నుఁ బూర్తిగఁ బరాభవించినను, అట్టిగౌరవము నాకుఁ దప్ప నితరులకుఁ గలుగఁగూడ దని నాయుద్దేశము'[1]

ఈ యుత్తర మనందపాలునిపక్షమువారిచేఁ బ్రకటింపఁబడినది కాదు. శత్త్రుపక్షమువారిచేఁ బ్రకటింపఁబడినది. అందువలన నిజ మనుటకు సందేహము లేదు. అనందపాలుఁడు మహమ్మూదును పరాభవింపక యెల్లప్పుడును, అతనిచేత నే పరాజితుఁ డగుట సంభవించె నేని 'నేను నిన్ను పూర్తిగ గెలిచితి' నని అతఁడు మహమ్మూదునకు వ్రాయుట యెట్లు తటస్థించును? కావున అనందపాలుని[2] సత్యచరిత్రను చరిత్రకారు లింకను శోధింపవలసియున్నది.

---

1. Elliot's History of India, as told by its own historians, Vol. 11, pp. 12; 14.

2. కొందఱు చరిత్రకారు లీతనిని 'అనంగపా' లని వాడియున్నారు. అది పొరపాటు. మూలశబ్దము ఆనందపా లయినప్పటికిని చరిత్రకారు లందఱును 'అనందపాల్' అనియే వ్రాసినందున మే మీయుచ్చారణయే గ్రహించినారము.

**అనందపూర్** (ఒరిస్సా) — ఇది ఒరిస్సాదేశమునందలి సంస్థానములలో నొకటియగు కియోంఝరులోనున్న యొక గ్రామము. వైతరిణీనదియొడ్డునఁ గలదు. జనసంఖ్య ౨,౯౭౫.

**అనందపూర్** (సంస్థానము) — ఇది బొంబాయి రాజధానియందలి కఠేవాడపరగణాలలోని యొకచిన్న సంస్థానము.

**అనకర్లపూఁడి** — నెల్లూరుజిల్లా కందుకూరుతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౧,౧౧౯ (౧౯౩౧).

**అనకవోలు** — చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకా యందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౧౯౬ (౧౯౩౧).

**అనకాపల్లి గ్రామము** — ఇది అనకాపల్లి తాలూకా యొక్క ముఖ్యపట్టణము. ఇది విశాఖపట్టణమునకు ౨౦ మైళ్లదూరమున శారదానదిమీఁద నున్నది. ఇచ్చటికి చుట్టుపట్టుపల్లెలనుండి వరి, చెఱకుగడలు మొదలగువస్తువులు హెచ్చుగా వచ్చుచుండుటచేత మంచి వర్తకస్థానముగా నున్నది. ఇచ్చటినుండి బెల్లము వరిధాన్యము ఎక్కువగా ఎగుమతి చేయఁబడుచున్నవి. ఈపట్టణము ౧౮౭౮-వ సంవత్సరమున స్థాపింపఁబడిన ఒక మ్యునిసిపలుసంఘముచే పాలింపఁబడుచున్నది. ఈపట్టణముయొక్క ఆదాయమును ఖర్చులును రమారమి ౭౫,౦౦౦ రూపాయలు. రాజకీయోద్యోగస్థు లందఱును ఇచ్చటనే వాసము చేయుచుందురు. తూర్పుతీరపు ఇనుపదారి ఈ పట్టణము మీఁదుగఁ బోవుచున్నది. జనసంఖ్య ౨౩,౩౭౬.

**అనకాపల్లి తాలూకా** — ఈతాలూకా చెన్నపురి రాజధానిలో నున్న విశాఖపట్టణము జిల్లాకు ఆగ్నేయదిక్కున ఉ. ౧౭° ౨౦', ౧౭° ౫౫' కును, తూ. ౮౨° ౫౭', ౮౩° ౧౫' కును మధ్య నున్నది. దీనివిస్తీర్ణము ౭౯౭ చదరపుమైళ్లు. ఇందలి జనసంఖ్య ౧,౮౭,౫౬౭. ఈతాలూకాలో ౧౭౫ గ్రామము లున్నవి. గవర్నమెంటువారికి ఈతాలూకావలననుండి రమారమి ౧,౨౨,౦౦౦ రూపాయలకిస్తు చెల్లుచున్నది. ఈతాలూకాయొక్క ఉత్తరభాగము మంచి నీటివసతి గలదియును, సారవంతమైనదియు నగుటచేత వరి, చెఱకుగడ, మొదలగుపంట లచ్చట పండును. సముద్రతీరమున నున్న భూమి ఇసుక నేలయైనందున మంచిపైరు లచ్చట పండవు. ఇది ఒక జమీన్‌దారీ తాలూకా. ఈ జమీన్‌దారీ కొన్నిభాగములుగ విభజింపఁబడి యున్నది. ఇవి గోడేవారికిని, కాశింకోటవారికిని, విజయనగరము చీపురుపల్లి ఎస్టేటుదార్లకును చెందియున్నవి. పూర్వము కాశింకోట శ్రీకాకుళముసర్కారుయొక్క సేనానివేశము (Military Contonment) అయియుండెను.

**అనకూటాద్రి** — హిందువులపురాణములలో తఱచుగ నుదాహరింపఁబడిన ఒక కొండ. గిరిరాజ మని దీనికి మఱియొక పేరు. ఇది మధురజిల్లాలో (సంయుక్తప్రాంతములలో) మధుర తాలూకాలో నున్నది. నిజమున కిది యొక గుట్టయే కాని కొండ కాదు. ౧౦౦ అడుగులకన్న నెక్కువయెత్తు లేదు. పొడువుమాత్రము ౫ మైళ్లుండును. దీనిమీఁద చెట్టు చేమ కూడ విశేషముగ లేవు.

**అనక్రియన్** — గ్రీకుకవి. క్రీ. పూ. ౫౬౦ ప్రాంతమున ఆశియామైనరులో జన్మించెను. విఖ్యాతుఁడగు సైరస్ ౫౪౫ లో ఆసియాలో గ్రీకువారిక్రింద నున్న పట్టణములను ముట్టడించినపుడు, అచ్చటినుండి 'త్రేసు' పట్టణమునకుఁ బాఱిపోయెను. అచ్చటినుండి శామాస్ నకుఁ బోయి 'పాలిక్రేటస్' అను రాజుచే గౌరవింపఁబడి యాతని యాస్థానకవిగా నుండెను. ఆరాజు కాలము చేసినతరువాత ఏథెన్సుపట్టణమున నధికారిగా నుండి 'హిప్పార్కస్' అనువాని యాశ్రయమున నుండెను. వాఁడును చనిపోయినతరువాత నీతఁడు తన జన్మభూమియైన టయాసునకు తిరిగివచ్చెను. ఇతఁడు ౮౫ సంవత్సరములు బ్రతికియుండె నని చెప్పెదరు.

ఇతఁడు కొన్ని దేవతాస్తుతులను రచించెను. పచ్చి శృంగారము గల భావగీతములు కొన్ని యాతనిపేరను గలవు. కాని కొందఱు పండితు లవి యాతనివి కా వని తలంచెదరు.

**అనగార్లపల్లి** — చిత్తూరుజిల్లా కుప్పంతాలూకాయందలి జమీన్‌దారీగ్రామము. జనసంఖ్య ౯౭ (౧౯౩౧).

**అనఘ** — శాకద్వీపమునందలినది.

**అనఘుఁడు** — ౧. ఒక గంధర్వుఁడు.

౨. ఒకరాజర్షి.

**అనచార్సిస్** — సిరియన్ తత్త్వవేత్త. క్రీ. పూ. ౬౦౦ ప్రాంతమున నున్నవాఁడు. గ్రీసురాజధానియైన ఏథెన్సునకు వెళ్లి సోలన్‌వలన గ్రీకుజ్ఞాన మంతయు నేర్చుకొనెను. ఆ దేశమునందు సత్పురుషులుగా నెంచఁబడినవారిలో నొక్కఁడు. తనదేశమునకుఁ దిరిగి వచ్చి తాను నేర్చినవిద్య లన్నియుఁ దన దేశస్థులకు నేర్పెను. ఇతఁడు యజ్ఞము చేయుచుండఁగా నితనితోఁడఁబుట్టినవాఁడీతనిని చంపెను.

**అనధ్యాయము** — అధ్యయనము చేయఁదగనికాలము. బడిపిల్లలకు నాటవిడుపు. పూర్వకాలపు వీథిబడులలోఁ బౌర్ణమాసికిని, అమావాస్యకును సెలవు ఇచ్చుచుండిరి. అట్టిదినములనే స్మృతికారులు అనధ్యాయము లనిరి. ఎప్పుడెప్పుడు పాఠశాలలకు సెలవు లీయవలసిన దన్నవిషయమున స్మృతికారులు మిక్కిలి సూక్ష్మములయిన నియమములను జేసిరి. అధ్యయన మనఁగా మొదట వేదాధ్యయన మనియే యర్థము. వేదము నెప్పుడు పఠింపవలయును, ఎప్పుడు పఠింపఁగూడదు అన్న చర్చలో నీ నియమము లన్నియుఁ బుట్టినవి. అవియే యితరవిషయములను బోధించుపాఠశాలలకుఁ గూడ నుపయోగించినవి.

అనధ్యాయములు రెండు విధములు—నిత్యములు, నైమిత్తికములు. నిశ్చితములై యెల్లప్పుడును ఆయాకాలములందుఁ దప్పక వచ్చునవి నిత్యములు; అమావాస్య, పౌర్ణమాసి, చతుర్దశి మొదలైనవి. 'అమావాస్యా గురుం హన్తి శిష్యం హన్తి చతుర్దశీ' (అమావాస్యరోజున అధ్యయనము చేసినయెడల గురువు చచ్చును. చతుర్దశి దినమున అధ్యయనము చేసినయెడల శిష్యుఁడు చచ్చును) అన్న వాక్యము సుప్రసిద్ధము. నైమిత్తిక మనఁగా తప్పక వచ్చునది కాదు; ఏదో కారణముచే నొకప్పుడు వచ్చును, ఒకప్పుడు రాదు. ఉఱుములు మెఱుపులతో గొప్పవర్షము పడ్డనాఁడు అనధ్యాయము, పాఠశాలకు నెవరైన పెద్దలు వచ్చినప్పుడు అనధ్యాయము. 'శిష్టాగమనా దనధ్యాయః' (పెద్దలు వచ్చినందున నాటవిడుపు) అన్నవాక్యము సంస్కృతపండితు లెఱింగినదియే.

ఏవి యనధ్యాయదినము లన్నసంగతిని గుఱించి వేఱువేఱు స్మృతికారులు వేఱువేఱువిధముగ వ్రాసియున్నారు. వాని నన్నిటిని అనధ్యాయములుగా నెంచినయెడల నధ్యయనదినములకంటె ననధ్యాయదినములే యెక్కువ యగును. మనుస్మృతిని అనుసరించి యీ క్రింద ననధ్యాయదినముల పట్టిక నిచ్చుచున్నాము :—

వర్షాకాలమునందు పగలు గాలి దుమారము వచ్చినయెడలను, రాత్రి గాలి వీచినయెడలను (౧౦౨); ఉఱుము, మెఱుపు కలసిన వర్షము వచ్చినప్పుడు, ఎక్కువగ నుల్కాపాతము జరగినప్పుడు, మరల మఱుదినము అకాలమువఱకు (౧౦౩); అకాలముగ మేఘములు వచ్చినప్పుడు (౧౦౪); అంతరిక్షమున ధ్వని కలిగినప్పుడు, భూకంపము కల్గినప్పుడు, ఆకాశమందలి గ్రహాదులకు పరివేషము కలిగినప్పుడు మఱునాఁడు మరల నాకాలమువఱకు (౧౦౫); మంచు పట్టినప్పుడు, రెండు సంధ్యాసమయములు, అమావాస్య, చతుర్దశి, పౌర్ణమాసి, అష్టమి (౧౧౩); అమావాస్య గురువును చంపును, చతుర్దశి శిష్యునిఁ జంపును, అష్టమీపౌర్ణమాసులు విద్యను నాశముఁ జేయును; కావున ఆ దినములలోఁ జదువుట మానివేయవలయును (౧౧౪); దుమ్ముతోఁ గలసి వర్షము కురిసిననాఁడును, ఆకాశ మెఱ్ఱగా నున్ననాఁడును, నక్కలు కుక్కలు కూయునప్పుడును, గాడిద లఱచునప్పుడును, (౧౧౫); గ్రామములోనికి దొంగలు వచ్చినప్పుడును, గ్రామమునకు అగ్నిభయము కల్గినప్పుడును (౧౧౮); ఉపాకర్మసమయమందును, ఉత్సర్గసమయమందును మూఁడుదినములు, అష్టకములకును, ఋతువుల అంతమునందును మూఁడుపూఁటలు అనధ్యాయము (౧౧౯); చుట్టము వచ్చినప్పుడు అతని సెలవు పుచ్చుకొని అధ్యయనము చెప్పవలెను (౧౨౨); గురుశిష్యులనడుమనుండి పశువు, కప్ప, పిల్లి, కుక్క, పాము, ముంగిస, ఎలుక పోయినయెడల నొకపగలు రాత్రి అనధ్యాయము [మనుస్మృతి, ౪-వ అధ్యాయము].

అనన్యదాసుఁడు — హిందీకవి. అక్బరు సమకాలికుఁడు. బికానీరుసంస్థాన వాస్తవ్యుఁడు. కాయస్థ కులీనుఁడు. భగవద్భక్తుఁడు. ఇతనికాలమునందు బికానీరురాజ్యమును రాయసింహుఁ డను రాజు పాలించుచుండెను. అతని తమ్ముఁడగు పృథ్వీరాజు ఒకసారి వైరాగ్యవశుఁడై ప్రపంచమును విడిచెద ననఁగా నీకవి యతనికి సంసారమునం దుండియే పరమార్థము సాధింపవలె నని బోధించెను.

అనపతెట్టు — రాజులఖండ్రిక అనియు దీనికి నామాంతరము. ఇది చిత్తూరుజిల్లా కాళహస్తితాలూకాయందలి జమీన్దారీ గ్రామము. జనసంఖ్య ౭౦౬ (౧౯౩౧).

అనపర్తి — తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౫,౬౭౩ (౧౯౩౧).

**అనపోతనాయఁడు** — వేంకటగిరి సంస్థానాధీశ్వరుల పూర్వులలో నొక్కఁడు. సింగమనాయని పెద్దకుమారుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౩౨౩ మొదలు ౧౩౭౦ వఱకు బ్రతికియున్నట్లు కానవచ్చుచున్నది. ఇతనిరాజధాని రాచకొండ. ఇది నైజామురాజ్యమందలి నల్లగొండజిల్లాలో హైద్రాబాదునకుఁ దూర్పుగ ౩౨ మైళ్లమీఁద నున్నది. ఈతఁడు జల్లిపల్లెకోటను ముట్టడించి యందున్న చళుక్యవంశపురాజులను, వారికి సాయముగ వచ్చిన పెక్కురు రెడ్డివీరులను గెలిచె ననియు, ఇనుకుర్తికోటను ముట్టడించి యందలి రాచవారిని గెలిచె ననియు 'వెలుగోటివారిచరిత్ర' మనుగ్రంథమువలనఁ దెలియుచున్నది.

ఈ యనపోతనాయఁడు ఓరుఁగల్లు, గోలకొండ, భువనగిరి మొదలయిన దుర్గములను గెలిచె ననియు, ఇప్పటి నైజామురాజ్యములో నున్న తెలుఁగు జిల్లాలన్నియు నాతనియధీనమం దుండె ననియు, అతఁడు స్వతంత్రుఁడై రాజ్యపరిపాలనము చేసె ననియు, ధరణికోట సమీపమున అనపోతరెడ్డి, అనవేమారెడ్డి అనురెడ్డిరాజులతో ననేక యుద్ధములు జరపుచు వచ్చె ననియు, ఈతఁడును ఈతనితమ్ముఁడును ధరణికోటలో రెడ్డివారితో యుద్ధము చేయుచుండఁగా, తురుష్కులు తమరాజధానిపై దండెత్తి వచ్చి రని విని వెడలిపోయి రనియు, అనపోతనాయఁడు ఢిల్లీచక్రవర్తికడకు రాయబారులఁ బంపి బహమనీరాజ్యముమీఁదికి దండెత్తి రమ్మని కోరె ననియు, ఆ సంగతి తెలిసి బహమనీసుల్తానయిన మహమ్మదుషా వీరిమీఁదికి దండెత్తివచ్చె ననియు, అనపోతనాయఁడు వారికి గోలకొండ యిచ్చి సంధి చేసికొనె ననియు ఆంధ్రులచరిత్రమునఁ (౩-వ భాగమునందు, పుట ౨౮-౫౩) జెప్పఁబడినది. కానియిందుల కచ్చట నేమియు నాధారములు చూపఁబడనందున నివి యింకను శోధింపవలసిన విషయములు.

**అనపోతారెడ్డి** — గుంటూరుమండలమునందలి కొండవీటిలో రాజ్యము చేసిన రెడ్డిరాజులలో రెండవవాఁడు. కవిత్రయములో నొక్కఁడైన యెఱ్ఱాప్రెగడరచితమైన హరివంశమును కృతి నొందిన ప్రోలయవేమారెడ్డి యాతని తండ్రి. తండ్రితరువాత నీతఁడు

రాజ్యమునకు వచ్చెను. ఈతనితరువాత రాజ్యమేలిన అనవేమారెడ్డి ఈతనితమ్ముఁడు; కొమరగిరిరెడ్డి ఈతని కుమారుఁడు. రాజమహేంద్రవరమునఁ బ్రభుత్వము చేసిన కాటయవేమారెడ్డి యీతనికి నల్లుఁడు, మేనల్లుఁడు. శాసనములనుబట్టి చూడఁగా ఈతఁడు ౧౩౫౦ మొదలు ౧౩౬౧ వఱకుఁ బన్నెండుసంవత్సరములు రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది.[1]

ప్రోలయవేమన హరివంశమును కృతినొందువఱకు నీతఁడు పెద్దవాఁడై సైన్యాధిపతిగఁ దండ్రికిఁ దోడగుచుండె నని హరివంశమందలి యీక్రిందిపద్యమువలనఁ గానవచ్చుచున్నది:—

శా. వేమక్ష్మాధిపుసార్వభౌముఁడు దయావిభ్రాజి యవ్యాజతే
జోమార్తాండుఁడు కీర్తనీయసుగుణస్తోమంబులం దేమియుల్
రామన్పార్థికి లొచ్చుగాక సరియై రాజిల్లె రాజార్చితుం
డామహ్యాయణుఁ డెందుఁ బోతియచమూపాగ్రేసరుం డిమ్మహిన్.

ఈ యనపోతారెడ్డి కృష్ణానదియొడ్డున అమరావతిసమీపమునందు 'కేసరా' యనువానితోఁ బోరాడి యాతనిని ఓడించినట్లును, ఆతని యాస్థానమందు వెన్నెలగంటివారను కవు లుండినట్లును, వారిచే నతఁడు కృతు లందినట్లును వెన్నెలకంటి సూరన్నచే రచింపఁబడిన విష్ణుపురాణమునందలి యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది:—

ఉ. ఈ నిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చిన రావుతుఁ గేసభూవిభుం
గానకుఁ దోలి వెన్నడిచి కాచిన వేమయయన్నపోతభూ
జానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటివారిలోన్.

ఈతనియొద్ద వేమన అనువాఁడు మంత్రిగ నున్నట్టు అమరావతిలోని యొకశాసనమువలనఁ దెలియుచున్నది. ఈ మంత్రితండ్రిపేరు మల్లినాథుఁడు. ఈతఁడు ధాన్యవాటి (ధరణికోట, అమరావతి) లోని అమరేశ్వరుని మరలఁ బ్రతిష్ఠించెను. ఇది ౧౩౬౧ లోనిశాసనము[2].

ఈతనిరాజ్యకాలమందు దేశాంతరములనుండియు, ద్వీపాంతరములనుండియు వర్తకు లీతనిరాజ్యమునకు వచ్చుచున్నట్లును, ఎగుమతి దిగుమతివ్యాపార మెక్కువగ జరగుచున్నట్లును కానవచ్చుచున్నది. బాపట్లతాలూకాలో మోటుపల్లి యను రేవుగ్రామము కలదు. అది కాకతీయులకాలమునుండియు సముద్రవర్తకమునకుఁ బేరొందినరేవు.[3] అచ్చట వీరభద్రస్వామిదేవాలయపు మండపమందలి యొకస్తంభముమీఁద అనపోతారెడ్డిశాసన మొకటి శా. శ. ౧౨౮౦ (క్రీ. శ. ౧౩౫౮) లో వేయించినది కలదు[4]. అది సంస్కృతము, తెలుఁగు, అఱవము అను మూఁడు భాషలలో నున్నది. అఱవవర్తకులు పెక్కుమంది అఱవదేశమునుండియు, సింహళమునుండియు వచ్చుచున్నందున శాసనము అఱవభాషయందుఁగూడ వ్రాయఁబడిన దని తోఁచుచున్నది. అంతకుఁ బూర్వము వర్తకులకుఁ గల యిబ్బందులను ఈ రాజు తొలఁగించి వర్తకము అప్రతిబద్ధముగ జరగునట్లు చేసెను. మోటుపల్లిలోఁ గాఁపురముండు పరదేశీయులగు వర్తకులు దూరదూరప్రదేశములతోను, ద్వీపములతోను వర్తకముచేయువారు అనేకు లుండిరి. ఈరాజునకుఁ బూర్వము ఇట్టివర్తకులకు నిష్టము వచ్చినప్పుడు మోటుపల్లికి వచ్చుటకును, ఇష్టము వచ్చినప్పుడు అచ్చటినుండి వెళ్లుటకును వీలు లేకయుండెను. అధికారులసెలవు పుచ్చుకొని గాని ఆగ్రామమునకు వారు వచ్చుటకు, అచ్చటినుండి వెడలుటకు వీలు లేదు. ఈ వర్తకులు అపుత్రికదండ మనుపన్ను చెల్లింపవలసియుండెను. ఈ యిబ్బందులను తీసివేసి అనపోతారెడ్డి యీ ద్వీపాంతరవ్యాపారులకు స్వేచ్ఛావిహార మేర్పఱిచెను. క్రొత్తగఁ గాఁపురము వచ్చువారికి నుండుటకు నివేశనస్థలమును, వ్యవసాయమునకు భూమియు నిచ్చుచుండిరి. ఈశాసనానుసారముగ వర్తకుఁడు తనవీలునుసరించి రావచ్చును, పోవచ్చును. తనకు నిష్ట మున్నవారికి నిష్టమున్నంతధరకు సరకుల నమ్మవచ్చును. సరకులు మఱియొకద్వీపమునకుఁ గొంపోవచ్చును. ఎవరిసరకులను దొరతనమువారియుద్యోగస్థులు పడవేసిపెట్టఁగూడదు. ఇట్లు ఈరాజు పదునాల్గవశతాబ్దియందు నొకవిధమైన అప్రతిబద్ధవ్యాపారతత్త్వమును (Principle of Free-trade) స్థాపించె నని చెప్పవచ్చును. అధికారులు వర్తకులను బాధపెట్టి సుంకము లెక్కువ తీసికొనకుండ సుంకము తీసికొనవలసిన రీతి యేర్పఱిచెను. ఇంతకంటె నెక్కుడు తీసికొనఁగూడదనియు శాసింపఁబడియున్నది. ఇట్లు ఆకాలమందు తెలుఁగుదేశమువారు ద్వీపాంతరములతో నవ్యాహతముగ వర్తకము చేయుచుండిరనియు, నితరదేశములనుండి వచ్చు వర్తకులకుఁగూడ నన్యాయము జరగఁగూడ దని తగిన నియమములను అప్పటిరాజులు చేయుచుండిరనియు స్పష్టముగఁ దెలియుచున్నది. ఈశాసనము రాజునాజ్ఞచే నాతని అమాత్యుఁడైన సోమమంత్రీశ్వరునిచే వేయఁబడెను.

---

1. కొండవీటిరెడ్ల ప్రభుత్వకాల మింకను నిశ్చయముగ నిర్ణయము కాలేదు; రెండుమూఁడు సంవత్సరములు హెచ్చుతగ్గుగ తేలిన దనవచ్చును. ఇంకను క్రొత్తక్రొత్తశాసనములు వెలువడినకొలఁదియు ఈ హెచ్చుతగ్గులు సరికాఁగలవు.
2. L. R., Vol. 38. p. 28 and Ep. Coll., no. 258 of 1897.
3. Ep. Coll., no. 600 of 1909.
4. Ep. Coll., nos. 601 and 602 of 1909.

ఇందు ౬౦౧ అఱవశాసనము, ౬౦౨ తెలుఁగుశాసనము. తెలుఁగు శాసనమునకంటె నఱవశాసనమునందు సుంకముల వివర మధికముఁ గలదు. మోటుపల్లిలోని అఱవశాసనము, తెలుఁగుశాసనముల నకళ్లు పంపినందులకు దొరతనమువారిశాసనశోధనశాఖకు నధ్యక్షు లగు బ్రహ్మశ్రీ రావుసాహెబు హెచ్. కృష్ణశాస్త్రిగారికి కృతజ్ఞుఁడను.—ము. సం.

అనపోతారెడ్డికి దొడ్డాంబిక యను తోఁబుట్టు వుండెను. ఆమెను కాటయరెడ్డి కిచ్చిరి. వారిరువురికిఁ బుట్టినవాఁడు కాటయవేమన. ఈతనికే అనపోతారెడ్డి తనకూఁతురైన మల్లాంబిక నిచ్చెను[1]. ఇతనికిఁ గుమారగిరిరెడ్డి యను కుమారుఁ డుండెను.

'అనపోతానాయని తమ్ముఁడైన మాదానాయఁడు దన్నాల కోటయొద్ద ననవేమారెడ్డి బంధువైన యనపోతారెడ్డితో యుద్ధము చేసి యాతనిఁ దఱిమి జయమును బొందెను' అని వెలుగోటివారిచరిత్రలో నున్నది కాని దీనికి నచ్చట నేమియు నాధారము చూపఁబడలేదు.

సంస్కృతశాసనములందును, తెలుఁగుశాసనములందును ఈతని పేరు అనవోత, అన్నవోత, అంనవోత అని వచ్చునే కాని 'అనపోత' అని ఉండదు.

(కో. వేం. ల.)

**అనబాప్టిస్టులు** — క్రైస్తవులతెగలలో అనబాప్టిస్టులనువా రొకరు. చిన్నతనముననే పరిశుద్ధస్నానము (Baptism) నిచ్చుపద్ధతిని వీ రొప్పుకొనరు. అందుచేత తమసిద్ధాంతముల నంగీకరించి తమలో చేరఁదలఁచువారికి చిన్నతనమున పరిశుద్ధస్నానము నొందిన క్రైస్తవులకైనను సరే, మరల సంస్కారము గావించుచుండిరి. ఈసిద్ధాంతమును మొదట ప్రచారములోనికిఁ దెచ్చినవాఁడు నికొలస్ స్టార్చ్ అనునతఁడు. తరువాత క్రైస్తవులకును, వీరికిని ఎన్నియో వాదోపవాదములు, పోరాటములు జరగినవి. నేఁడు అనబాప్టిస్టులను పేరే యెచటను వినరాదు. బాప్టిస్టులనఁబడువా రిప్పటికిని కలరు. కాని వీరికి అనబాప్టిస్టులతో నెట్టిసంబంధమును లేదు. రెండవసారి సంస్కారము చేయుపద్ధతిని వీ రొప్పుకొనరు.

**అనమనపూఁడి** — కృష్ణాజిల్లా గుడివాడతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౭౨౧ (౧౯౩౧).

**అనమనమూరు** — గుంటూరుజిల్లా ఒంగోలుతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౧,౦౪౯ (౧౯౩౧).

**అనమసముద్రము** — నెల్లూరుజిల్లా ఆత్మకూరుతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౩౯౯ (౧౯౩౧).

**అనమసముద్రముపేఁట** — నెల్లూరుజిల్లా ఆత్మకూరుతాలూకాలోని యొకపల్లె. జనసంఖ్య ౧,౦౨౦ (౧౯౩౧). ఇచ్చట ఖాజా రహీముతుల్లా సాహెబ్ అనువానిచే ౧౬౦ సంవత్సరములకు మున్ను కట్టింపఁబడిన సుప్రసిద్ధమగు మసీదు కలదు. ఈమసీదునకు ౮ గ్రామముల ఈనాము కలదు. ఇచ్చట జూలైమాసమున పెద్ద ఊరుసు (ఉత్సవము) జరుగును.

**అనమిత్రుఁడు** — ౧. (సూ. వం.) నిఘ్నునిపుత్రుఁడు.

౨. (చం. వం.) యదుకులోత్పన్నుఁడైన వృష్ణియొక్క యిద్దఱుపుత్రులలో రెండవవాఁడు. నిమ్ని, శిని, వృష్ణి యనువా రతనిపుత్రులు.

**అనరణ్యుఁడు** — ౧. (సూ. వం.) ఇక్ష్వాకువంశజుఁడగు పురుకుత్సునిమనుమఁడు. త్రసదస్యుని రెండవకుమారుఁడు. ఇతనికి హర్యశ్వుఁడు, బృహదశ్వుఁడు అను ఇద్దఱు పుత్రులు కలరు. ఇతఁడు అయోధ్యలో రాజ్యము చేయుచుండఁగా లంకాధిపతియైన రావణుఁడు దిగ్విజయార్థమై వచ్చి యీతనిని ఓడించెను. యుద్ధమునందుఁ గూలి యీతఁడు ప్రాణములు విడుచుచు 'నావంశమునందు జన్మించినవాని చేతనే నీవును, నీవంశమును నాశముఁ జెందుదురుగాత' మని శాపమొసఁగెను (వా. రా., ఉత్తర., స. ౧౯).

౨. (సూ. వం.) ఇక్ష్వాకుకులోత్పన్నుఁడైన ఋతుపర్ణునిపౌత్రుఁడగు సర్వకాముని (సర్వకర్మని) యిద్దఱుపుత్రులలోఁ బెద్దవాఁడు. ఇతని కొడుకు నిఘ్నుఁడు.

**అనర్కచతుర్దశి** — కార్తికశుద్ధచతుర్దశి అనర్కచతుర్దశి యనఁబడును. ఈనాఁడు హనుమంతుని జన్మదినము. రామభక్తులెందఱో యీనాఁడు మహోత్సవము లొనర్తురు.

**అనర్ఘరాఘవము** — మురారి యను కవిచే రచింపఁబడిన సంస్కృతనాటకము. సంస్కృతవాఙ్మయమునందు కాళిదాస, భవభూతులకుఁ గల గౌరవము ఈకవికి లేకపోయినను, ఈతఁడు రెండవతరగతికవులలో నొకఁడుగఁ బరిగణింపఁబడు నని చెప్పవచ్చును. ఇతనిది మౌద్గల్యగోత్రము. భట్టశ్రీవర్ధమానుఁ డనుమహాకవి యీతనితండ్రి, తంతుమతి ఈయనతల్లి. ఈసంగతు లీతని నాటకమునందలి ప్రస్తావనలోఁ జెప్పఁబడియున్నవి[2]. ఈతనిది ఏదేశమో తెలియదు. కాని కావ్యమాలలో నీ నాటకమును అచ్చువేసినవారు 'దీనికి కాశ్మీరమునందు నెక్కుడు ప్రచారము కల'దని వ్రాసినారు. అందుచే నీకవి యాదేశమువాఁ డేమో యని కొంద ఱనుకొనిరి. కాని నాకుఁ జూడ నీకవి యాంధ్రదేశమువాఁ డేమో యని సంశయము తోఁచుచున్నది. ఎందు కనఁగా, ఈనాటకమునందు ఏడవయంకములో, శ్రీరామాదులు రావణసంహారానంతరము పుష్పకవిమాన మెక్కి అయోధ్యకు వెళ్లుచుండఁగాఁ గ్రిందఁ గానవచ్చిన కొన్ని దేశములను, పట్టణములను, క్షేత్రములను వర్ణించునట్టిసందర్భమునఁ గవి ఆంధ్రదేశమందలి భీమేశ్వరుని నిట్లు వర్ణించియున్నాఁడు:—

1. Epigraphia Indica, Vol. IV, p. 328.

2. 'అస్తి మౌద్గల్యగోత్రసంభవస్య మహాకవేర్భట్ట శ్రీ వర్ధమానతనూజన్మన స్తన్తుమతీనన్దనస్య మురారేః కృతి రభినవ మనర్ఘరాఘవం నామ నాటకమ్.'

ప్రముఖులుకూడ అశ్వినీకుమారునికి ప్రవాసశిక్ష విధించుట అన్యాయమని యభిప్రాయపడిరి. ఇట్టిసందర్భములలో ప్రభుత్వమువారి కతనిని తప్పనిసరిగ విడుదలచేయవలసివచ్చెను.

అశ్వినీకుమారుఁ డిదివఱలో నుడివినట్లు మితవాది. ఇతఁడు కాంగ్రెసువిషయమునను, స్వదేశీఉద్యమము విషయమునను ఎక్కువ యభిమానముతో పనిచేసెను. ౧౯౦౬ - వ సంవత్సరమున సమావేశమయిన వంగరాష్ట్రసభ కతఁ డాహ్వానసంఘాధ్యక్షుఁడుగ నుండెను. అటుపిమ్మట ౧౯౧౩ లో డక్కాలో జరిగిన వంగరాష్ట్రమహాసభ కతఁడధ్యక్షుఁ డయ్యెను. ఇతఁడు మితవాదియయినను తనయభిప్రాయమును పైకి స్పష్టముగఁ జెప్పుట కెప్పుడును వెనుదీసినవాఁడు కాఁడు.

అశ్వినీకుమారదత్తు అనేక భాషల నభ్యసించెను. హిందీ, మరాఠీ మున్నగు దేశభాషలను బాగుగ నభ్యసించి ఆయాభాషలయందలి మతగ్రంథములను జదువవలయు నని యాతనియాశయము. సంస్కృతమునందును, పార్శీయందునుగూడ నతఁడు మంచిపాండిత్యము సంపాదించెను. అతఁడు వ్రాసిన 'భక్తియోగము' అను గ్రంథము చాల విఖ్యాతమయినది. దేశభాషలయందును ఆంగ్ల భాషయందునుగూడ నీగ్రంథమున కనువాదములు కలవు. దీనిని శ్రీయుత కోతా శ్రీరామ శాస్త్రిగారు ఆంధ్రీకరించి యాయీ గ్రంథమును తెలుఁగువారికి సులభము చేసినారు. భక్తియోగమును భారతీయ పండితులును పాశ్చాత్య పండితులునుగూడ నత్యధికముగఁ బ్రశంసించినారు.

పల్లెటూళ్లలో విద్యాభివృద్ధిని గూర్చియు, పారిశుద్ధ్యమును గూర్చియు, కృషిప్రచారములను కావించుటకై అశ్వినీకుమారదత్తు ప్రత్యేకముగ నొకసంఘమును స్థాపించి, యాసంస్థకు నేఁటేట మూఁడు వందలరూపాయలరాబడి గలయాస్తి నొసంగెను. నాటక ప్రదర్శనములద్వారా సాంఘికదురాచారములను ప్రజలకు వెల్లడించుటకై అతఁడు కొన్నియాత్రానాటక సంఘములను స్థాపించి పట్టణములకుఁ బంపుచుండువాఁడు. కలకత్తాలో నిట్టిసంఘములు నాటకములను ప్రదర్శించినప్పుడు ఆశుతోషముఖర్జీ మున్నగు విద్యాధికులు కూడ వాని నెక్కువగఁ బ్రశంసించియుండిరి. ఈ మహాశయుఁడు ౧౯౨౩-వ సంవత్సరము, నవంబరు ౭-వ తేదీని కలకత్తాయందు పరమపదించెను.

**అశ్వినీకుమారులు** — దేవతలకు వైద్యులు, ఋగ్వేదమందును, ఇతరవేదములందును ఈదేవతలను స్తుతించినసూక్తములు పెక్కులు గలవు. దేవశిల్పియైనత్వష్ట తనకూఁతురైన సరణ్యును సూర్యున కిచ్చి వివాహము చేసెను. ఆమె సూర్యతాపమును భరింపలేక తనరూపమువంటిరూపముగల మఱియొకస్త్రీని సూర్యునియొద్ద నుంచి తాను ఆఁడుగుఱ్ఱపు రూపమును ధరించి వెడలిపోయెను. సూర్యుఁడు కొన్ని దినములకు నామోసము కనుఁగొని తాను మగగుఱ్ఱపురూపము ధరించి ఆఁడుగుఱ్ఱమువెంటఁ దగిలెను. వారియిద్దఱకు నశ్వినీకుమారులు పుట్టిరి. వీరు కవలు (ఋగ్వే., ౧౦. ౧౭. ౧-౨). ఎచ్చటవచ్చినను ఇద్దఱును కలసివచ్చెదరు. ఋగ్వేదమునందుఁ బెక్కుసూక్తములలో వీరు చేసినట్టివైద్యసంబంధమైన యద్భుతకృత్యములు వర్ణింపఁబడినవి. వందనుఁ డన్నవానిని, రేభుని కూపమునుండి తీసిరి; తౌగ్ర్యుని సముద్రమునుండి రక్షించిరి; ముసలియు బలహీనుఁడును అయిన చ్యవనుని పడుచువానినిగఁ జేసిరి; అగ్నిలోఁ గాలిన అత్రికి సుఖము కలుగఁజేసిరి; కాణకుఁ గణ్వునకుఁ గన్నులు, తొడపోయిన విశ్వలకు నినుపతొడ, శయువఋషియొక్క యెండిపోయినయావునకుఁ బాలు నిచ్చిరి; ఆథర్వణుఁడైన దధ్యఙ్ఋషికి గుఱ్ఱపుఁదల పెట్టి వానియొద్దనుండి మధువిద్య నేర్చిరి; శ్యావుఁ డను ఋషి మూఁడుతునకలు కాఁగా బ్రతికించిరి (ఋగ్వే., మం. ౧ సూక్త. ౪౬, ౪౭, ౧౧౨, ౧౧౬-౧౨౦).

అశ్వినీకుమారులకు మొదట హవిర్భాగము లేదు. వీరు చ్యవనునకు యౌవన మొసఁగఁగా నాతఁడు తనతపోబలముచే నింద్రుని మెప్పించి వీరికి హవిర్భాగ మిప్పించెను[1]. ఇట్లు మహాభారతమునందు (వన, అ. ౧౨౧-౧౨౫; ఆంధ్రభా., ౩. ౩) జెప్పఁబడినది, ఋగ్వేదము ౧-వ మండలమునందే అశ్వినీదేవతలను హవిర్భాగమునకుఁ బిల్చినమంత్రములు కానవచ్చుచున్నవి (౧. ౩; ౧. ౨౨; ౧. ౩౪).

వేదమునందుఁ జెప్పఁబడిన యశ్వినీదేవత లెవ్వరన్నవిషయమై చర్చించుచు యాస్కాచార్యుఁ డిట్లు వ్రాసియున్నాఁడు :—

'అశ్వను లనఁగా అశ్వములుగల పుణ్యవంతులైన గొప్పరాజులని ఔర్ణభావఋషియొక్క యభిప్రాయము................... అశ్వను లెవరు ? భూమ్యాకాశము లని కొందఱు; అహోరాత్రము లని కొందఱు; సూర్యచంద్రు లని కొందఱు; పుణ్యము చేసినయిద్దఱు రాజు లని ఐతిహాసికులు చెప్పెదరు' (నిరుక్తము, ౧౨-౧).

దీనినిబట్టి చూడ సృష్టిచమత్కారములను జూచి వైదికకవులు రూపకముగ దేవత లని వర్ణించి రనియుఁ, దరువాతివారు వారిని నిజముగ దేవత లని నమ్మి కథల కల్పించి రనియుఁ దోఁచుచున్నది.

అశ్వినీదేవతలు గుఱ్ఱముయొక్క నాసికనుండి పుట్టిరి గనుక నాసత్యు లనియుఁ బేరు. వీరు మిక్కిలి చక్కనివారు. చక్కనిపురుషులకు వీరిని ఉపమానముగఁ దీసికొందురు. వీరియిద్దఱకు నశ్వినౌ, నాసత్యౌ, దస్రౌ అన్నపేళ్లున్నను పెద్దవానికి నాసత్యుఁ డనియు, చిన్నవానికి దస్రుఁ డనియు విడిగఁ బేళ్లున్నట్లు కానవచ్చెడిని (మహాభా., అనుశా., అ. ౧౫౦, శ్లో. ౧౭). పాండురాజపత్నికి మాద్రికి వీరివలన నకుల సహదేవులు కలిగిరి.

1. 'యజ్ఞము' యొక్క తల పోఁగా నశ్వను లింకొకతలపెట్టి బ్రతికించి రనియు, నందుచే నశ్వినీదేవతలకును వైద్యులకును గౌరవము కలిగె ననియు, అప్పటినుండి యీ దేవతలకు హవిర్భాగము కలిగె ననియు ధన్వంతరి సుశ్రుతమునందు వ్రాసినాఁడు (సూత్రస్థానము, ౧). ఈవిషయమే తైత్తిరీయసంహిత ౬, ౪, ౯, ౧; శతపథబ్రాహ్మణము, ఐతరేయబ్రాహ్మణము, ౧. ౧౮ లలోఁగూడఁ జెప్పఁబడియున్నది.